శ్రీ

# ప్రసన్నయాదవ నాటకము.

(మనోరమపత్రికనుండి ముద్రింపఁబడినది.)

ఇది

## చిలకమర్తి - లక్ష్మీనరసింహముచే

రచియింపఁబడినది.

రెండవ కూర్పు.

రాజమహేంద్రవరము:

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1907.



దీనివెల 8 అణాలు.

శ్రీ

# ప్రసన్నయాదవనాటకము.

## ప్రథమాంకము.

### నాంది.

మ. మును లాస్థానకవీంద్రు; లాగమచయంబు ల్వందిబృందంబు; స
జ్జనచిత్తంబులు కొల్వుకూటములు; సంద్రంబు ల్ధనాగారము
ల్మనుజుల్ సెడిసేవ యప్పనము; బ్రహ్మాండంబు సామ్రాజ్య మె
వ్వని కాయాదిమచక్రవర్తికృపఁ గాపాడు స్సభాస్తారులన్. 1.

మఱియు

తే. గీ. ప్రాణికోటుల నెల్లఁ బాత్రములఁ జేసి
జగ మనెడు మహారంగదేశంబునందు
నావలెనె నాటకంబులు నడపునట్టి
సూత్రధారుండు మిముఁ బ్రోచు శుభము లొసఁగి. 2.

సూత్రధారుఁడు—(నాంద్యనంతరమున తెరవంకఁ జూచి) పారిపార్శ్వకా! వొకసారి యిటు రాఁగలవా?

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) అయ్యా! ఇదిగో వచ్చియున్నాఁడను. నేనేమి చేయవలసియున్నది?

సూత్ర—ఓహో! సాయంకాలమునుండి ప్రయత్నము చేయుచున్నను నీ విప్పటికిని రంగకృత్యమును సిద్ధముచేయలేకపోయితివా?

పారి—అయ్యా! మీరు నిష్కారణముగా నాపై నేరము మోపుచున్నారు. అంతయు నీవఱకే సిద్ధమయి యున్నయది. సభాసదులతో మనము ప్రయోగింపఁబోవు రూపకమునుగూర్చి మీరు చెప్పవలసినది చెప్పకపోవుటయే యాలస్యము.

సూత్ర.—ఏమీ! నాదే యాలస్యమా? అట్లయిన నిదిగో జెప్పుచున్నాఁడను. రసికశిఖామణు లగు నోసభాసదులారా! విద్వజ్జనవిధేయుఁ డగు బ్రహ్మశ్రీ చిలకమర్తి

లక్ష్మీనృసింహాకవిచేత నాంధ్రభాషలో రచియింపఁబడిన ప్రసన్నయాదవ మనుపేరిటి ప్రధానరూపకమును, మే మీరాత్రి యిచ్చటఁ బ్రయోగింపఁ దలఁచుకొన్నారము కావున మీరు సావధానులరయి చిత్తగింతురుగాక!

పారి—అయ్యా! ఈనాటకగుణాగుణంబులఁగూర్చి యించుకేనియుఁ జెప్పనైతి వేమి?

సూత్ర—దానింగూర్చి చెప్పఁదగినవాఁడను నేను గాను.

మ. కవి సౌవర్ణారి, కృతుల్నగ, లర్థయి బంగారంబు, శ్లేషాదిస
త్కవనంబుల్నగిషీపను ల్లసదలంకారంబు లుద్యన్మణీ
నివహంబుల్; గృతి మెచ్చి యొట్టిదియొ తన్నిర్మాత నేర్పెట్టిదో!
వివరింపందగు నాణెకాండ్రు గద! యుర్విన్ బండితగ్రామణుల్.

పారి—ప్రబంధ మెట్లున్నను బ్రయోగకుశలుల మగుమనము సభాసదుల రంజింపఁ జేయఁగలమని నేఁ దలంచెద.

సూత్ర—ఓపండితంమన్యా! గర్వోక్తులతో నేమి ప్రయోజనము?

క. తనరూపము, తనవిద్యయుఁ
దననేర్పును దనగుణంబు తనగానము, గ
న్గొని యెవఁడు సంతసింపఁడు?
తనవిషయము నెంచ నొరులె తగువారుసుమీ! 4

మఱియు నీ వనినయట్లు మనము ప్రయోగకుశలుల మే యయిన నంతమాత్రమున సభాసదులు సంతసిల్లరు. ఏమనిన—

చ. కృతి రసవంతమయ్యు మది కింపొనగూర్పదు నాటకుల్సము
ద్ధతమెయి నాడకుండినఁ బ్రదర్శకు లెల్లఁ బ్రయోగపద్ధతి
న్జతురులె యైన నేమి కృతి చప్పనిదైనపు డాప్రయోగము
న్గృతియును మంచిదైనపుడె నిండుముదం బగుఁ జూచువారికిన్. 5.

పారి—అట్లయిన గ్రంథచమత్కృతియుఁ బ్రదర్శకులసామర్థ్యముఁ గనిపెట్టుటకు, సభాసదులుమాత్రము నేర్పరులయి యుండవలదా?

సూత్ర—ఓయీ! ఇటువినుము?

తే. గీ. కవియు నాటకుల్నేర్పరుల్గావలయును
సభ్యులగువార లెప్పుడు చతురమతులె
వంటకత్తియ జాణ గావలయుఁ గాక!
తినెడువారికిఁ వద్రుచు దెలియకున్నె?

పారి—సరే! చతురమతు లయినసభాసదు లందఱు కావ్యమునందును మన ప్రయోగమునందును గలగుణమ్ములు గ్రహించి యానందింతురుగాక !

సూత్ర—గుణగ్రహణపారీణులే యట్లు చేయుదురు. తదితరులు దోషాన్వేషణముఁ జేయుచుందురు. అయినను నీనాటకమును బ్రయోగించునపు డెల్ల సభాస్తారులతో నిట్లు మనవి చేయుమని కవి యానతిచ్చియున్నాఁడు.

తే. గీ. సత్కవి యొనర్చు కావ్యంబు సరసువోలె
స్వచ్ఛమై రసవంతమై సౌఖ్యద మగుఁ
గుటిలధీవరు రసములు గ్రోలలేక
నీచగతి విసారములకై నెమకికొంద్రు. 7.

మఱియు

తే. గీ. శ్రీపురాణపండకులాబ్ధిశీతకరుఁడు
సరసుఁ డాంధ్రగీర్వాణభాషావిదుండు
మల్లయార్యుండు నా మేనమామ యగుటఁ
గవిత యెటులున్న నీకృతి గణుతిఁ గాంచు. 8.

పారి—అయ్యా! నీవు సభాసదులతోఁ జెప్పవలసిన దంతయుఁ జెప్పితివిగనుక నేనిఁక నాటకప్రయోగమున కారంభించెదను.

సూత్ర—వేషము లన్నియు సిద్ధము చేసితివా ?

పారి—సిద్ధమయి యెంతసేపయినది? అదిగో! మనసుమిత్రుఁడు మహేంద్రుని వేషము వేసికొని మహావైభవముతోఁ గొలువుండుటకు ముచ్చటపడుచున్నాఁడు.

సూత్ర—(చూచి) ఔనౌను. ఈసభాసదులతో నింకొకమాట మనవిచేసి పోవుదము. ఓసదస్యులారా!

మ. అమరాధీశునికొల్వుఁ జూచి, యటపై నయ్యూర్వశీమంజువా
క్యము లాలించి సుఖించి, ద్వారకను సత్యాపద్మగంధీసమే
తు మురారాతినిఁ గాంచి, మీఁద హరి చైత్యుల్ పోరు సంగ్రామరం
గమునం జెందుక సిచ్చి, మీమనసు లానందాబ్ధి నోలాడుతన్. 9.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

# ప్రథమాంకము.

రంగము—ఇంద్రసభ.

[అప్పుడు పీఠములమీఁదఁ గూర్చుండి మహేంద్రుఁడు, బృహస్పతి, జయంతుఁడుఁ బ్రవేశించుచున్నారు.]

మహేం—(విచారముతో నిట్టూర్పువిడిచి) ఆచార్యా!

చ. పొడ వడఁగెన్ హిరణ్యకశిపుండు, గతించెను దారకాసురుం
డడఁగెఁ గథావశేషుఁ డయి యాదశకంఠుఁడు, మా కిఁకన్ భయం
బుడిగె నటంచు నీత్రిదివముద్ధృతదానవకంటకంబ య
య్యెడుఁ గదయంచు నేఁ దనర నీనరకుం డెటనుండి వచ్చెనో. 1.

బృహ—మహేంద్రా! ఎటనుండి వచ్చెనో యన నేల? పద్మగర్భుని యవివేకమునుండియు మనమందభాగ్యమునుండియు—

ఆ. వె. మొదలఁ జేసినాఁడు పిదప దైత్యతపంబు
మెచ్చినాఁడు వరము లిచ్చినాఁడు
వేల్పుఁబెద్ద యనుచుఁ జేసు పెద్దయె కాని
యతఁడ చేసె మనకు నధికహాని. 2.

మహేం—పద్మగర్భునినిందించుటకన్న మనభాగధేయమును దూఱుట యుక్తము. నేఁ జేసినదోస మేమోకాని యీనాకపరిపాలనము దినదినగండము వేయేండ్లాయు వన్నట్టు లున్నది. ఒక రాక్షసుఁడు గాఁడు. ఒకనాఁటిపరితాపము గాదు. మూఁడు జగంబులకు నేకచ్ఛత్రాధిపత్యంబు వహించి ముప్పదిమూఁడుకోటులదివ్యులకు నాయకుఁడ నయిన నేను క్షణక్షణము నసురభీతిచే గుండెలు చేతఁ బట్టుకొనియుంటఁ జూడ నాలోనాకె సిగ్గగుచున్నది. అనవరత చిత్తసంక్షోభకారణ మయిన యీసామ్రాజ్యంబు నేలుటకన్న నిరపాయంబును, నివృత్తసకలలౌకికవ్యాపారంబును, నిర్మనస్తాపమును నగు మునివృత్తిఁ బూని నారాయణుచరణంబు శరణంబుగాఁ గానలనుంట సముచితం బని తోఁచుచున్నది. అమరపక్షపాతి యగు నబ్జనాభుం డెన్నెన్ని యవతారంబు లెత్తి యెందఱెందఱ దైత్యులం దునిమినను నిర్జరులభాగ్యదోషమున వారికులంబులు తామరతంపరలయి నానాఁట నభివృద్ధిఁ జెంది యిసుకపాతరలట్లు తఱుగకున్నవి. పాపనిరతంబును, గుణవిరహితంబును నగు నాయధమదానవానీకంబునకు వంగివంగి జోహారు

లోనర్పలేక, యొదిఁగియొదిఁగి యుండలేక, సపర్యలు సలుపలేక, విసిగిపోవుచుంటిని. ఈనరకాసురుండు ప్రచ్ఛదనమున సోమకునికన్నఁ, గ్రౌర్యంబునఁ దారకునికన్న, మగఁటిమి హిరణ్యకశిపునికన్న, బరకాంతాసక్తి రావణునికన్న, మిన్నయఁట. విశేషించి లోకభయంకరుండు మురుండును, దుష్కరారంభుండు నిశుంభుండును గ్రూరస్వభావుండు హయగ్రీవుండును శౌర్యధనుండు పంచజనుండును వానికిం బాసట యయి వచ్చి నాలుగుభుజంబు లట్లు పచరింతురు. ఇంతకు వారిపై నరిగిన మనబలంబుగతి యేమి యయ్యెనో తెలియదయ్యె. నేఁ డది యేమోకాని శూరజనసులభ మగునుత్సాహము నాహృదయమున నెలకొనియుండలేదు. నామనస్సు పరాజయమునే శంకించుచున్నది.

బృహ—మహేంద్రా! వెఱవ నేటికి?

తే. గీ. మూఁడఁదలఁచిన మేల్కీళ్ళ నీడలట్లు
ధృతియు భీతియుఁ బొడసూపు హృదయమందు
సాధుజనములు వానిసూచన లెఱింగి
భావిగతులబుద్ధిని నెంచి పని యొనర్తు. 3.

వెఱ దినమాత్రమున నాపదలు దూరమునకుఁ బోవు. ధైర్యమూనిన నవి సమీపమునకు రావు. వగచి చేయునది లేదు. కావున సదాత్తపురుషలక్షణ మగుధైర్యము విడిచి యుండరాదు.

జయం—ఆచార్యా! అమరేశ్వరున కింత వెఱఁగుపాటుఁ గలిగించు నాదైత్యుఁ డెవ్వరి కుమారుఁడు? ఏమిమహిమవాఁడు? ఈయుదంత మెఱిఁగింపఁబోలునేని నా కెఱిఁగింప వేఁడెదను.

బృహ—వత్సా! ఎఱిఁగింపరాకేమి? చెప్పెద వినుము. వినియుండువుగదా! తొల్లి భువనకంటకుఁ డగుహిరణ్యాక్షుఁ డనదానవకులసార్వభౌముఁడు కలఁడని. అతఁడు తనమగఁటిమి నిర్జరుల కజేయుఁడై భూమిదేవిని సెలుగులఁ జెట్ట నాకారణమున ననవరతము దేవపక్షపాతి యగునారాయణుండు శ్వేతవరాహరూప మెత్తి యారక్కసుఁ బరిమార్చి భూమిదేవి నుద్ధరించి తనకోనకొమ్మున ధరియించి బుజ్జగించె అప్పుడు పురుషోత్తమునకును భగవతి యగువసుంధరకును నరకుఁడు జన్మించె. పదపడి వాఁడు తనతపోవిశేషమున వారిజాసనుని మెప్పించి వరములఁ బడసి మర్త్యలోకము జయించి దివమును జుట్టుముట్టి యిప్పుడు మనకు వెఱపుఁగొలుపునంతవాఁ డయ్యె.

జయం—(ఆశ్చర్యముతో) ఏమి? భువనరక్షణపరాయణుఁ డగునారాయణునకును, విశ్వహితకారిణి యగుధారుణికిని నుదయించిన నందనుఁడో యితఁడు? ఈతఁడు నిర్వ్యకర్మములకు వెనుదీయునిరక్కసుఁ డెట్లయ్యెను.

బృహ—కుమారా! ఆశ్చర్యమేల? చూడుము.

తే. గీ. నిఖిలజనులకుఁ జల్లనినీడ నిచ్చు
వృక్షశాఖలు రాపాడువేళలందు
పొడము నగ్నికణము కాల్చునడవు లెల్ల
జన్మభూమితో నేమి యసాధువులను. 4.

మహేం—కుమార! అదియట్టిద. చూడుము.

తే. గీ. జలదములనుండి పిడుగులు జాలునట్లు
మంచివారికి ఖలులు జనించుచుండ్రు
మంత్రిలో నుద్భవించెను మణులలాగు
ఖలులకడుపున నుత్తము ల్గలుగుచుండ్రు. 5.

జను—అయ్యా మీరు సెలవిచ్చినదంతయు నిశ్చయము. దానవకులక్రమాగతం బగుకాఠిన్యమునకుఁ దోడు రణస్థైర్యంబునను నప్రతిహతప్రతాపంబునను వాఁడు క్రమంబునఁ దకిదంద్రులఁబోలి పుట్టెఁ గావున నతఁడు నిర్జరుల కజేయుఁ డని తోఁచుచున్నది. యుద్ధవార్త దెలుపుటకు సమరరంగంబునుండి యింతవఱకు మనభటుఁ డొక్కఁడు రాకుండుటకుఁ గారణ మేమయి యుండును?

బృహ—అదిగో నెవ్వరో యిటు వచ్చుచున్నారు. (పోల్చి చూచి) కుబేరపరిజనుఁ డగుమాణిభద్రుఁడు.

మహేం—కుతఁ డేమివార్త చెప్పనోకద! ముఖవైఖరి కీడును సూచించెడును.

[అప్పుడు మాణిభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాణి—(తనలో) కటకటా! నేను నిక్కలి మందభాగ్యుఁడను. ఈశ్రవణకఠోర మగువార్త మహేంద్రునకు నే నెట్లు విన్నవింతును? అయినను స్వామి యగు కుబేరుని నియోగము నడుపక తప్పదుగదా!

చ. అనుపమధర్మమార్గచరు లైనసుపర్వులు పాఱుచుండ దు
ర్జనులు కృపావిహీనులును రక్కసు లాజిజయంబు గాంచుటల్
గనుఁగొన ధర్మమే జయము గాంచెడు నంట యబద్ధ మంచు నన్
ఘనభుజసారమే విజయకారణ మంచును నేఁ దలంచెదన్. 6.

(ప్రకాశముగా) రక్షింపుము. రక్షింపుము. త్రిలోకాధినాథా! (అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

మహేం—(సంభ్రమముతో) ఓయి! ఏమి మూడినది ? దేవసేనల పరాజయ మెఱింగింప వచ్చితివా?

బృహ—నాకలోకము ముక్కడిరక్కసులపా లయినదా ?

జయ—దేవకాంతల యదృష్టములు విపరీతములై యయ్యెనా ?

మాణి—(లేచి) దేవా! మందభాగ్యుఁడ నైన నేను దేవరకు దేవసేనలవిజయ మంగళవార్తలు దెలుప నోచుకొననైతిని.

మహేం—ఆదేవాసురసమరము మన కశుభపరిణామ మెట్లయ్యెనో సంగ్రహముగా మా కెఱింగింపుము. కాలోచితముగ వలయుప్రతిక్రియ యొనర్చుకొందము.

మాణి—(అంజలిపట్టి) దేవరవా రవధరింతురుగాక. ఆవిధమున ముర, నిశుంభ, కంసజన, హయగ్రీవ సమధిష్ఠితంబు లయి దైత్యదానవానీకంబులు లోకంబులు మ్రింగు లాగున నార్చుచుఁ జేర్చి నిల్చిన, యమ యాదఃపాల, దహన, ధనద, పవన, పశుపతి ప్రముఖు లగుదిక్పాలకులు వేలుపుమూఁకలం గూర్చుకొని యరదంబులు, ద్విరదంబులు, బాణంబులు, తూణంబులు, హయంబులు, భటచయంబులు, నాయత్తంబు గావించుకొని మొగ్గరంబులు పన్ని యెదుర్కొనుటయు నుభయబలంబులు నోహరిసాహరిఁ బెనఁగి సమరం బొనర్చె. అప్పుడు నిర్జరసైన్యారణ్యంబుపయిఁ గాఱుచిచ్చువచ్చిన దైత్య నాయకుఁడు పెచ్చుపెరిఁగి.

సీ. కఱకుఁగత్తులఁ బూని కౌబేరబలములఁ జెఱకుఁగడ్డల నట్లు నఱికినాఁడు
యాబకాఁ జెలరేఁగి యగ్నిదేవునిమూఁక సన్నచీమల నట్లు చమిరినాఁడు
గుదియ చేతను బూని కదిసి వాయుణసేన వాలమందల నట్లు తోలినాఁడు
శరపరంపర లేసి జముబంట్లమేనులు చించిజల్లెడ లట్లు చేసినాఁడు
క్రోల్పులులఁబోలు దైత్యులకోల్తలఁ జెడి
వేల్పులలమేఁక లటుపాటి విఱుగఁబలసె
దిక్కు లేలినవారలో దివిజనాథ
దిక్కుమాలినవారలై తిరుగఁబలసె. 7.

మఱియు సేనలు పోయినపోక గాఁ దిరిగిచూడక చనుటయు.

తే. గీ. మనకృశానునితేజంబు మంటఁ గలసె
నాఁటినరుణదేవునిశక్తి నీటఁ గలసె
నెచటికో వాయుబలమెల్ల నెగిరిపోయెఁ
జిక్కి సగమయ్యె నీశానుఁ డుక్కుసక్కి. 8.

మహేం—(విచారముతో) అన్నన్నా! ఎంతకష్టము. అవ్వల నేమయినది?

మాణి—అనంతరము సంగ్రామప్రసిద్ధు లగుసిద్ధులును రిపుజనదుస్సాధ్యు లగు సాధ్యులును, పరాక్రమహార్యత్వు లగుయక్షులును, ధనుర్విద్యాధరు లగువిద్యాధరులును, గరుడగంధర్వాదు లగుతక్కుంగల ఖేచరులును, నిశాచరులం దలపడిరి.

బృహ—దైవము వారికయినఁ దోడుపడకపోయెను గా?

మహేం—దానవులకుఁ దోడుపడియె ననుఁడు. ఆతరువాత నేమి జరిగినది?

మాణి—ఏమి జరిగినది యని యడుగ నేల? ఈయశుభము తుదముట్టఁ జెప్పెద వినుండు.

తే. గీ. అసురసేన విజృంభించి యంతఁ దఱుమ
వేల్పుజోదులు వెన్నిచ్చి విఱిగి చనిరి
యొకరు పోయినదెసకు నింకొకరు పోక
తెగినహారంబులోని ముత్తియము లట్లు. 9.

బృహ—సరే. ఇంక వినవలసిన దేమి యున్నది?

ఆ. వె. జ్వలనదేవుఁ డోడె జలధినాయకుఁ డోడె
దండపాణి యోడె ధనదుఁ డోడె
కూల్చువాఁ డెవండు కుటిలదైత్యులఁ గర్వ
మనుభవింపవలయు నంతెగాక. 10.

మహేం—అయ్యో మాణిభద్ర! ఇప్పుడు నాయనుంగునెచ్చెలు లగుదిక్పాలు రెం దున్నవారు?

మాణి—దేవా! ఎందున్నవా రని తెలుపుదును? కొందఱు పలాయితు లగుచుండ దానవులు వారినిఁ బట్టుకొని బంధించి శిబిరంబుల నుంచిరి; కొందఱు వాహనంబుల నెక్కియు పెఱికొందఱు పాదచారు లయియుఁ దల విరియఁబోసికొని వెనుక చూడక పోయెడుచో బెఱుంగక దానవులబారిఁబడక తప్పించుకొన నూడనిఁ బాడు చుండిరి. కొందఱు పలువిడలేక యొందేని నక్కి క్రుక్కియున్నవారు.

మహేం—హా సఖులారా! దిక్పాలురార! మీ కెట్టిగతి ప్రాపించెను? ఓయీ దండధర! ఎన్నఁడును నీడవోని నీకాలదండమునకు నే డింతపాటు వచ్చెనే. నిజప్రతాపప్రకంపితకాలకంఠుం డగుశతకంఠునిఁ బూరికిం గొనని నీమగఁటిమి తుచ్ఛుం డగునరకునిమోల మొక్కవోయెనే? ఓయివరుణా! మృత్యుజాలసంకాశంబు లగునీపాశంబులు దనుజకంఠప్రదేశంబుల నిరర్థకంబు లయ్యెనే? అగ్నిదేవా! శాత్రవసేనా

తూపుంబులం గాఁ బ్రభాకీలంబులు దనుజులకుఁ జంద్రకిరణజాలంబులయి తోఁచెనే? ఓయీ నైరృతా! 'వజ్రం వజ్రేణభిద్యతే' యన్నట్లు మాయాబలాభిశోభితు లగుదానవులను దానవాంశమునఁ బొడమిన నీవు నిర్జింతువని కొంతయాశతో నుంటిమి. అదియెల్ల వమ్మయ్యె. మిత్రమా! కుబేరా! నిగ్రహానుగ్రహసమర్థుఁడగు భగవానుఁడు కాలకంధరుఁడు నీకు సంగడికాఁడై నిను గాచుచున్నను నీ కీపాటులు దప్పవయ్యెను.

ఆ. వె. నరుఁడె యంతవాఁడు నారాయణుఁడు తోడు
మదనవైరితోడు మన కఁటంచు
చింత దక్కియుండ చిట్టలింతలు పుట్టె
నుక్కుమేసఁ గాల్చె లక్కనీల. 11.

జయం—అయ్యా! మిక్కిలి యధైర్యముపడియెదరేల? ఆపన్నమయంబున శూరు లనుసరింపఁదగినమార్గ మనుసరింపుఁడు.

మాణి—మహేంద్రా! ఊరక యధైర్యముపడి యేమి చేయుదురు. ఇంకను నావేదింపవలసిన దించుక కలదు. నేను చెప్పునది సాంగముగా విని సమయానుకూలముగా నెయ్యది కర్తవ్యమో దాని నొనర్తురుగాక.

మహేం—అట్లయిన నీ చెప్పవలసినదంతయుఁ జెప్పుము. వినుచున్నాఁడను.

మాణి—కిమ్మట యక్షేశ్వరుఁడు కుబేరుఁడు రణరంగమునుండి తొలఁగి తన హయముపైఁ గూరుచుండి పరుగిడుచు మార్గాయాసముచేత వగర్చుచు నెంతయుఁ గష్టమున నన్నుఁ జేరి తమ కిట్లు సందేశ మంపె. "త్రిలోకాధినాథా!"

చ. నేనిటులైతి; నాఁడె రజనీచరవీరుఁడె గెల్చె; వాయు, వై
శ్వానరముఖ్యులుం దొలఁగి పాఱిరి; కావఁ గదయ్య నందనో
ద్యానము నంగనాతతి, సుధాకలశంబును బారిజాతసం
తానముఖామరద్రుమవితానమును న్ఘనకామధేనువున్. 21.

మహేం—మిత్రమా! కుబేర! ఆపత్సమయమునందును స్వామిహితమును మఱవని నీ చరిత్రము శ్లాఘాపాత్రము. ఓయీ! మాణిభద్ర! అట్లయిన నిప్పుడు రాక్షసేంద్రుని యుద్యమ మేమి?

మాణి—దేవా! దురాత్ము లయినశాత్రవులు జయమొందినపుడు పరాజితు లయిన పగతుర నేమి సేయుదురో యదియే వాని యుద్యమము.

బృహ—అది యేదో తేటతెల్లముగా నెఱిఁగింపుము.

మాణి—దానవబలంబులు దేవబలంబులను నుఱుమాడి వెన్నంటి తఱుముచుండ మేము గంభీరభీషణంబు లగుభాషణంబులతో రాక్షసరాజు తనబలంబుల కిట్లనియానతిచ్చె.

ఆ. వె. పూఁటకోట లనక పుణ్యభూము లనక
రాచనగరు లనక రచ్చ లనక
వెల్వఁద్రోలు సొచ్చి పిరదానవులార!
కొంపజంపు లేక కొల్లఁగొనరొ. 13.

బృహ—అట్లయిన మనము మనజాగరూకతమీఁద నుండవలయును.

మహేం—అయ్యా! ఎయ్యది యీయవసరమం దాచరణీయమో యెయ్యది యనాచరణీయమో నే నెఱుఁగఁజాలకున్నవాఁడ. మనసేన చిన్న తెలుఁగును రాక్షసుల యున్న తెఱఁగును విన నామనమున సమరసన్నాహోత్సాహంబు డిందుపడినది. త్రివిష్టపంబు విడిచిపోవుదమన్న పరిజనంబులు పడునగచాట్లు దలఁపునకు వచ్చి నన్నుఁ గాలు గదపనీయవు. దానవు నెదుర్కొందమన్న వాని నోర్చుట కరిది. కావున నిప్పుడు నే నేమార్గ మవలంబింపవలయునో మీరు నిర్ణయింపవలయును.

[తెరలో]

ఓహో! సిద్ధ, సాధ్య, విద్యాధర, గంధర్వ, యక్ష, కిన్నర ఖేచరులారా! త్రిలోకాధినాథుఁ డగుమహేంద్రుఁ డెందున్నవాఁడు. ప్రాగ్జ్యోతిషాధినాథుఁ డగుదానవేశ్వరుఁ డాతని దర్శనము చేయవచ్చినాఁడు. కావున నాతఁ డున్నతా వెఱిఁగింపుఁడు.

బృహ—(ఆలకించి) కడమపని చేయుటకు రాక్షసాధముఁ డిదిగో నీదెసకే వచ్చినాఁడు.

మహేం—ఆచార్య! ఆచార్య! కర్తవ్యము? కర్తవ్యము?

జయం—అంతఃపురరక్షణ మవశ్యకర్తవ్యము.

బృహ—మహేంద్రా! ఆ. వె. శౌర్యశక్తిఁ దలఁపఁ జనక యుండుట మేలు
శత్రుఘాతిదలఁపఁ జనుట మేలు
రెంట పోల్చిచూడ మొండిరక్కసునకు
సకల మిచ్చి చనుట చాల మేలు. 14.

మహేం—అట్లయిన స్త్రీలగతి యేమి? తక్కుఁగలవారలగతి యేమి?

సీ. కనబడ్డసతినెల్లఁ గవయఁ జూచెడునీచు గారవించునె వేల్పుఁ గన్నియలను
మాపేరు వినినంత మండిపడెడు దాయ ముద్దుసేయునె నాదుపుత్రకులను
స్వర్గ మంతయుఁ బాడుసలుప నెంచెడుకూళ విడిచిపోవునె కల్పవృక్షములను
ముని యాగపశువుల ముచ్చిలించెడుపాపి యపహరింపఁడె వేల్పుటావు నకట
కరుణ యొక్కింత యెఱుఁగని కటికవాఁడు
బ్రతుకనిచ్చునె యింక నైరావతమును

ముజ్జగంబులకొర కింత మూఁడు ననుచు
నించుకేనియుఁ గలదేని నెఱుఁగనైతి. 15.

బృహ—వాఁ డెంతఘాతుకకర్మ నయిన నానప్పుటను సందేహింపఁడు. కావున నప్సరలను దక్కఁగల పియప్సరాంగనలను మేరుపర్వతగుహలకుఁ దోడ్కొని పొమ్మని జయంతకుమారు నంపుట యుచితము. అమృతభాండమును గామగవియు వారలతోఁ బోవుఁగాక.

మహేం—అట్లయిన నింక జాగొనరించిన ప్రయోజన మేమి? వత్సా! జయంతా!

చ. తడయకుమన్న దానవకదంబము సేరకమున్న వేల్పుం
బడఁతులతోడ మీజనని భద్రముగాఁ గొనిపోఁగదన్న కా
అడవులకైనఁ బర్వతగుహాంతరభూములకైనఁ జెచ్చెర
న్గమువఁగఁ గొంతకాల మిటఁ గ్రమ్మఱవత్తురుగాక యుండఱన్. 16.

మఱియుఁ బులోమసుని గారపుఁబట్టియుఁ, జతుర్దశభువననాయకునిపట్టమహిషియు, నసూర్యంపశ్యయు నగు మీయమ్మతో నాలుఁబిడ్డలసంరక్షణము సేయఁజాలని వజ్రపాణి యిట్లు చెప్పెనని పలుకుము.

చ. మనమునఁ దొంటిసంపదలమాట దలంపకు శోక మెచ్చు; నొ
క్క నెలవునందె కష్టములు కాపుర ముండునె యెల్లయప్డు? మే
ల్దినములు వచ్చు నెండియును దివ్యలకో సఖి! యూరకు రాలువే
శను జగిదూలుచెట్లు మరల న్మధుమాసమున న్జిగుర్పవే. 17.

జయం—దేవా! అట్లయిన మీ రానతిచ్చినట్లు చేసెద. (అని పోవును.)

[తెరలో]

చ. తునియలుగాఁగఁ గొండలను ద్రుంచినదోర్బలశాలి, యాయహ
ల్యను వలపించినట్టిరసికాగ్రణి, స్వర్గపురైకనాథుఁడున్
గను లొకవేయి దాలిచి జగత్త్రయము న్గనిపెట్టు నేత, యా
య్యనిమిషనాథుఁ డేడి, దనుజాధిపుఁ డాతనిఁ జూడఁ గోరెడున్. 18.

బృహ—అదిగో నడచుచున్న తమాలవృక్షములో, పుంజీభూతము లగుకాఱు చీఁకటులో, యన రాక్షసులు మన మున్నదెసకే వచ్చుచున్నవారు. ఇదియును మేలె. ఇంతలో జయంతకుమారుఁడు కాంతాసంతానమును నిరపాయముగాఁ గొనిపోవచ్చును.

మహేం—ఆచార్య! ఇప్పు డితనితో నెట్లెదుర్కొని సంభాషింతము? సామవాక్యములతోఁ బట్టుపఱచిన సంధికి నంగీకరించునేమో?

బృహ—ఎంత వెఱ్ఱివాఁడవు? దురాత్ముఁడు శాంతవచనములఁ జక్కఁబడునే?

తే. గీ. అధముఁ డగువాని సామవాక్యముల యోగ్య
లనునయింప నాతనియల్క యినుమడించు
నెఱయఁగాలిన పెనముపై నీళ్లుచల్ల
పొగయు మంటయు బుస్సన నెగయునట్లు. 19.

మహేం—అట్లయిన నతఁడు రాకమున్న యనుష్ఠేయము నుపదేశింపుఁడు.

బృహ—అది యీవఱకే యుపదేశింపఁబడినది. అయినను మఱియొకమాఱు చెప్పెద. ఆదానవుఁ డీకొలువుకూటమునం జొచ్చినతోడనే నీవును నేనును మనవైరమును మనమనములనుండి దూరంబుగఁ దోలి యతని సబహుమానంబుగ నెదుర్కొని చింతామణీ భద్రపీఠంబున నాసీనుఁ గావించి నాకభువనంబును, నందనవనంబును, గల్పభూరుహంబులును, కనకాంబుజములు వాని కొసంగి మనము దొలఁగుట కార్యము.

మహేం—మన మెచ్చట నుండవలసినవారము?

బృహ—మేరుగుహలచెంతనో? మానససరోవరముప్రాంతనో?

మహేం—మన కీదుఃఖమునుండి విమోచన మెప్పుడు?

బృహ—రాక్షసుని మరణసూచన మెప్పుడో యప్పుడు.

మహేం—అది సంభవించు టెట్లు?

బృహ—ఇట్లు. ఆశ్రితావనపరాయణుఁ డగునారాయణుఁడు దుష్టదానవనిగ్రహంబునకును, శిష్టమానవానుగ్రహంబునకును యాదవవంశంబున నుదయించెనని పరమేష్ఠి సనత్కుమారునకుఁ జెప్పుచుండఁ దొల్లి యొకనాఁడు నేను వింటిని. మన మా దేవకీనందను నాశ్రయించి యీవిపత్సాగరము నీదుదము. అతనిచేతఁగాని తదన్యునిచే నీలోకకంటకుఁడు పిల్కుమారఁడు. మేటిరాకాసులఁ బోకార్ప నతఁడు కంకణముఁ గట్టియున్నవాఁడు. ఆనందనందనచరణారవిందముల పాలఁబడినవారు చెడినవారు లేరు.

మ. అగదంకారము లాజవంజవతమోహారప్రభావంకము
లజ్ఞదానందపదము లప్సరోయువతీసౌభాగ్యలుంటాకము
ల్నిగమోర్వీజశిఖాప్రవాళములు కాళీయాహినిర్బంధముల్
భగవంతుం డగుదేవకీతనయు శుంభత్పాదపంకేజముల్. 20.

కావున నాపుండరీకాక్షుకడకు మాణిభద్రుని నుచితసందేశముతోఁ బుత్తెంచుము. దాన మనకెంజిలి సమగ్రముగాఁ దీఱును.

మహేం—అవివేకాంధకారాతిశయమునఁ జెన్నఁగానక తిరుగలాడుచున్న నామనస్సునకు మీవచోదీపికలచేఁ జక్కనిదారి పొడకట్టినది. అట్లొనర్చెద. అయ్యా! మాణిభద్ర! నీవు మాకుదూతవై యమరకార్యముం దీర్పవలయు. ఇదిసకలభువనహితము.

మాణి—దేవా! ఆజ్ఞాపింపుము. సేవకున కిది మహాప్రసాదము.

మహేం—అట్లయిన నో మాణిభద్ర! జగద్భద్రసంధాయకుఁ డగువాఁడు దేవుఁడు వాసము సేయు ద్వారకానగరమునకుఁ జని యదుకుల కమలాకరప్రభాకరుం డగు నా పుండరీకలోచను సందర్శించి దివౌకసులయార్తి సమగ్రముగా విన్నవింపు.

సీ. కాళీయుపణిఫణాగ్రములఁ దాండవమాడు నడుగుఁదమ్ములకు జోహారు లనుము
అదితికశ్యపులను నవతరించిననాఁడు మముఁ గొనర్చిన మేలు మఱవ మనుము
అమరసంతతి యిట్టు లగచాట్లుపడుచుండ నోరునిక్కై వడిఁజూచు టొప్పదనుము
ఈతెఱంగునఁ జేయ లాఁతివారమె మేము చాలకాలము నాఁటిసఖుల మనుము
ఆలుఁబిడ్డలదెసఁ జూచి యమరవిభుఁడు
వేయుఁగన్నులబాష్పము ల్విడిచె ననుము
అసురఁగడతేర్చుపని తన కలఁతి యనుము
దైవహిత మాట నీయది తప్ప దనుము. 21.

మాణి—దేవా! అట్లంతయు విన్నవించెదను.

బృహ—దానవుఁడు వచ్చువఱకు నీ విటనుండి యతనిపల్కులు విని చెయిదములఁ గని యవ్వల నరుగుము అప్పుడు నిర్జరులయవస్థ యాదవేంద్రునకు సమగ్రముగ నెఱిఁగింప నవకాశ ముండును.

మాణి—హా! కష్టము. కష్టము. దానవసైన్యంబులు సవిధభూములకు రానే వచ్చినవి.

బృహ—మహేంద్రా!

చ. మనమున నించుకేని యనుమానము నొందక దానవేశ్వరు
న్గని వినయంబుతో నెదురుగాఁ జని గద్దియఁ జేర్చు; లావు మా
యునపుడు నల్పుఁడై యొదిగియుండుట న్యూనతగాదు గ్రీష్మమం
దున బలుతిప్పలుండు నదు ల్దొలఁకారునఁ బూర్తిఁ జెందవే? 22.

మఱియు నోసునాశీర!

తే. గీ. అధికతేజస్వులకు నైన నప్పుడప్పు
డుచ్చనీచదశలు గల్గుచుండుఁ జూవె
జగము వెలయింపఁగల సూర్యచంద్రులకును
గ్రమత నుదయాస్తమయములు గల్గునట్లు. 23.

మహేం—దేవగురువులయుపదేశము శిరసావహించినాఁడ. (అప్పుడు నరకాసురుఁడు, ప్రలంబజరుఁడు, వజ్రకంఠుఁడుఁ బ్రవేశించుచున్నారు.)

నర—ఓయీ పంచజనుఁడా! బాహుబలంబున, బుద్ధివైభవమున మనకన్న నల్పుఁడగుమహేంద్రుని సింహాసనభ్రష్టునిఁ గావించి నాకలోకమునుండి పాఱఁదోలక మనవంశకర్తలగు నాదిరాక్షసు లూరకుండుటకుఁ గారణమేమి ?

పంచ—దేవా! ఆమహాత్ము లూరకొనలేదు. దితిజదుస్సాధవిక్రమక్రీడారంభులయినమనపూర్వులు త్రిలోకవిజయంబు గావించినపుడు కుటిలుఁడగు విష్ణుదేవుఁడో మతిలేని శంకరుఁడో యేవో రూపములెత్తి వారలఁ గడతేర్చుచుండువారు. ఆకారణంబున నీతని కింతవిభవము జరుగుచున్నది. ఈపర్యాయము మీ రన్నట్లు నిరాటంకముగా జరుగఁగలదు.

నర—(నవ్వుచు) మనదానవవీరులు నిజముగా నాదామోదరునిచేత నయితేము నిహతులయిరా? అట్లయిన వారిపరాక్రమ మెట్టిదో చూడవలసినదే.

వజ్ర—మహాప్రభూ! వారు వట్టిపిఱికివారు. వీ రింపరవారు దిగఁదుడుపునకైనను బనికిరారు.

బృహ—మహేంద్రా! అదిగో దానవుఁడు. వాని నెదుర్కొనఁ జనము రమ్ము.

మహేం—దానవేంద్రా! నీకు స్వాగతము.

బృహ—దానవేశ్వరా! విజయమగుఁగాక.

పంచ—నీ వన్నను ననకున్నను విజయము మాపక్షమే యయినది.

నర—(ఆశ్చర్యము నటించుచు నింద్రునితో) ఎవరు వీరు? నముచిగర్వనిర్వాపణధుర్వహులు, పాకప్రతాపగంధసింధురపంచాననులు, బలప్రాణానిలకాలభుజంగులు నగునహల్యాభుజంగులా ? మహేంద్రా!

మ. అపరాధంబులు గల్గె మావలన చండారాతిసైన్యాటవీ
తపనోద్యద్దహనాయమానపటుదోర్దర్పప్రతాపాఢ్య ని
న్నిపు డీక్రీతినిఁ జూడవచ్చితిని నే నిన్నాళ్లు రాకుంటకు
న్గృపతోడన్ క్షమియింపు తమ్ముఁడఁగదా యెంతైన దేవేశ్వరా. 24.

అయ్యో పొఱబడితిని. నేను మీకుఁ దమ్ముఁడ ననుట మిమ్ము రెండవమా ఱవమానించుట గదా.

వజ్ర—అజాగళస్తనములవలె నిరర్థకమయినవజ్రాయుధము ధరించిన యీపరాక్రమహీనుని తమ్ముఁ డనిపించుకొన్న మీ కవమానము మహాప్రభూ!

పంచ—ఓమహేంద్రా! ఓదేవగురూ! నేను పంచజనుఁడను నరకమహారాజు బంటను.

బృహ—మేము మి మ్మెఱుఁగక పోలేము.

మహేం—దానవేశ్వరా! ఉల్లసపుఁబలుకులతో నేమి ప్రయోజనము? శత్రురాజులపై దండువెడలుట క్షత్రియధర్మ మగుటచే నీ విటు చేసితివి. ఇందు క్షమింపవలసిన దేమున్నది? జయము నొందితివని యెఱుఁగుదును.

మాణి—(తనలో) ఈసమయమున నే నిచ్చట నుండరాదు. చాటుననుండి వీరి పనులఁ గనిపెట్టెద. (అని పోవును.)

నర—పురందరా! నామాటలకు నీ వింత యుడికెద వేల? అట్లయిన నింక నుల్లసపుఁబలుకులతో నేమి. నావచ్చినపని చెప్పెద వినుము.

తే. గీ. ఎల్లభువనంబులకు నీవ యేలికవఁట
బలము గెలువాఁడవఁట మానవంతుఁడవఁట
కొండఱెక్కలఁ గోసినంటిఁ గూల్చితివఁట
యేది చూతము రణ మిమ్ము యిందుకంత. 25.

బృహ—(తనలో) మాయసహాయత్వము నెఱిఁగి వీఁడు మమ్ము మాటిమాటికి రణమునకుఁ బిల్చుచున్నవాఁడు.

మహేం—దనుజేశ్వరా! రణమున కేమి? అది యొక భాగ్యము కాదు. చూడుము.

చ. కనుఁగొన దేవదానవులు కశ్యపుసంతతివారె కావున
న్దనుజవరేణ్య! యన్నలకుఁ దమ్ములకుం బగ జెల్లునయ్య? లోఁ
గినిగాక మీరు మే మెపుడు క్షీరము నీరములట్లు లుండిన
న్మన నిఁకఁ జేరి మాడఁ దరమా యొకమాత్రపువాని కాజిలోన్. 26.

నర—ఆహాహా! ఎంతకాలమునకు నేను వినఁ జుట్టమ నయితిని?

పంచ—సోదరప్రేమ మహేంద్రునిశరీరమునుండి వెల్లివిరిసి పాఱుచున్నది.

వజ్ర—పిల్లుల కెలుకలును దోడేళ్లకు మేఁకలును నెంత దగ్గఱచుట్టములో మాకు మీరును నంత దగ్గఱచుట్టములే.

బృహ—ఓ దానవసార్వభౌమ! ఈమహేంద్రుఁడు వచియించినట్లు మనయుభయకులములు పొందుపొసఁగియుంట యుచితము. మీరు రాక రాక వచ్చినయతిథు లగుటచే మా కాదరణీయులరు అందుచేఁ గూరుచుండి ప్రసంగింతము. నీ వామహేంద్రపీఠము నధిష్ఠింపుము.

మహేం—దానవేంద్రా! అట్లు చేయుము. మాకు మీ రతిథులుగదా.

నర—ఓహోహో!

ఉ. ఎన్నఁడు లేనికూర్మి యిది యెప్పటినుండి జనించెనయ్య నీ
కిన్నరకుండు దేవవిభుఁ డెక్కడుపీఠము నెక్కువాఁడె మీ

రన్నను నే నొనర్పఁగలనా యది యయ్యది మెచ్చువాఁడు తాఁ
గన్నులు వేయి దాల్పవలె గౌతమునింటను గోడి గావలెన్. 27.

వజ్ర—నిజము. నిజము. అంతమహిమ గలవాఁడే దాని నధిష్ఠింపవలెను. పాప మీమహేంద్రుఁడు కష్టపడి రేయి యనక పగ లనక కోడియో కుక్కయో యయి వేయిగన్నులు తెచ్చుకొన్నాఁడు. అంతపాటిశక్తి యెవరి కున్నది?

బృహ—(తనలో) రాక్షసుని యెత్తిపొడుపుమాటలు భరింప శక్యముగాకున్నవి.

మహేం—(తనలో) ఇంతకన్న శూలములతోఁ బొడిచిన మేలు. కటకటా! కాల మెంతలో మాఱినది?

బృహ—దానవనాయక! ఎన్నఁడో పొరబాటున నొనర్చిన లోపముల నెంచి యింతవానిని మీ రధిక్షేపించుట మీవంటి వీరపురుషుల కుచితము గాదు.

నర—అట్లయిన మీకు హితముగు పనియే యొనర్చెదను. చిత్తగింపుఁడు. ఓయి మహేంద్ర! భూధరపక్షచ్ఛేదనశౌండ!

మ. ధరణీరాజ్యము వీరభోజ్య మని పెద్ద ల్సెప్పఁగా విందు ని
ర్జరలోకేశ్వర! రెండుపల్కుల కిట స్వప్రత్యుత్తరం బిమ్ము నీ
కరమందుం గులిశాయుధంబు గొని సంగ్రామంబు గావింతువా
సురసామ్రాజ్యపదంబు నాకుఁ గరము ల్మోడించి యర్పింతువా. 28.

పంచ—మహారాజా!

తే.గీ. కాలుదండంబు ధనదునికఱకుఁగత్తి
వరుణుపాశంబు మనమీఁద వచ్చులయ్యె
వజ్ర మేటికి ధరియింపవలయు వీఁడు
కొండలను రాళ్ళ మలిచి చెక్కుటకె గాక. 29.

వజ్ర—దేవా! మీరు చూచినతోడనే యెన్నఁడో చచ్చినట్లు నిశ్చేష్టులగు నీదేవరాజ బృహస్పతులు యుద్ధము సేయుదురా? బలహీనులమీఁద నెగురుమన్న చో నీయనవంటివారు మఱి యుండరు.

నర—మహేంద్రా! ఊరకయుండెదవేల? ప్రత్యుత్తర మిమ్ము.

పంచ—హరియో హరుఁడో తమకుఁ దోడ్పడువఱకు నిరుత్తరులయి యుందురు కాఁబోలు.

వజ్ర—హరియా వచ్చుట? అతఁడు తనరక్షణముఁ జేసికొన్నఁ జాలు వీరిని రక్షించినంత ఫలము.

నర—అన్నట్లు మఱచితిని. ఓయి దేవరాజా!

మ. హరి మీపాలిఁటి దైవతం బనుచు దైత్యధ్వంసి యంచు న్నుతిం
తురుగా మీరలు సర్వకాలమును జేతు ల్మోడ్చి వాఁ డేడి య
క్కఱకు న్రాఁడది యేమి? వచ్చి మిగుల న్గారుణ్య మేపార ని
ర్జరుల న్బ్రోవఁ డదేమి? పిమ్మట సమాశ్వాసింపఁ దావచ్చునే. 30.

మహేం—(తనలో) హరిని నీవిధముగా నిందించు వీని కేమిగతి కలదో కదా?

బృహ--(తనలో) ఇట్టివైపరీత్యములు కాలమాసన్నమైనవానియందుఁ గన్పట్టును.

వజ్ర—గురుశిష్యు లిద్దఱు బెల్లము కొట్టినరాళ్ళవలె నూరకుండెద రేల? మహారాజున కేదో యొక ప్రత్యుత్తర మిండు.

మహేం—ఆచార్యోత్తమా: ప్రత్యుత్తర మొసఁగుఁడు.

బృహ—దానవేంద్రా! వేయుమాటలేల? ప్రతాపానలపరిశోషితదిక్పాలకసేనాసముద్రులును దృణీకృతనారాయణులును నగు మీతో సమర మొనర్ప మహేంద్రుఁ డెంతవాఁడు? అతఁడు సంధి యుచిత మని యూహించుచున్నాఁడు.

పంచ—దేవదానవులవైరము సంధిచేసికొనుటకుఁ గాలము తప్పినది.

వజ్ర—ఇంద్రున కిప్పుడు భయజ్వరముచే నొక పెద్దసంధిరోగము ప్రవేశించినది.

నర—మహేంద్రా! అట్లయిన నానిశ్చయము విస్పష్టముగాఁ జెప్పెద వినుము.

చ. పలుమఱు వింటివచ్చరలపాటలు చేర్చితి వీవు మేను ని
ర్మలమృదుపారిజాతకుసుమంబులసెజ్జలమీఁద నాకభూ
ములు చిరకాల మేలితివి పూర్తిగఁ జెల్లెను నంతు మీకు దై
త్యుల కిఁక వంతు చెల్లదగు దూరము పొండు తొలంగి వేలుపుల్. 31.

దేవత లెంతకాలము స్వర్గము పరిపాలించి రంతకాలము దానవులును పరిపాలించిగాని తొలఁగరు. మఱియు మీరు స్వర్గమునుండి యొక్కపూరిపుల్ల యయినఁ గొనక యొంపయినఁ జని బ్రతుకుఁడు. దీనికి విరుద్ధముగాఁ బ్రవర్తింతురేని యీనరసుఁడు వేల్పులపై జాలినొందువాఁడు కాఁడని మీర యెఱుఁగుదురు.

పంచ—దేవా! మీరు లెస్సగా సెలవిచ్చితిరి.

వజ్ర—ఈపాడుదేవతలు నేఁటికాలమునకు మాయుసురుతగిలి పోవుచున్నారు.

మహేం—(విచారముతోఁ దనలో) రాజ్యలక్ష్మీ! నీవు చంచల వనుమాట నేఁడు నిశ్చయమయినది.

బృహ—(తనలో) అనుకొన్నదాని కేమియుఁ గొఱఁత కలుగలేదు.

మాణి—(తనలో) కటకటా! త్రిలోకాధీశ్వరున కెంత కష్టమువచ్చినది? ఇంక నేనిచట నిలువఁజాలను. నాపనిమీఁదఁ బోయెదను. (అని నిష్క్రమించెను.)

నర—ఓయింద్రబృహస్పతులారా! మీయునికి నాకోపాలంబునకుఁ బ్రజ్వలన హేతువు. కావున మీ రిటనుండి సత్వరము పొండు.

వజ్ర—చుట్టుపట్ల పొలిమేరలలోనైన మీరు కనఁబడుదురేని మీగుండెఁలో నిద్రపోయెదను. జాగ్రత.

బృహ—మహేంద్రా! ఏలయాలశ్యము. పోవుదము రమ్ము.

మహేం—(తనలో)

సీ. చిరకాలముననుండి సురల కాణాచియౌ విబుధలోకంబును విడుచు టెట్లు
చింతామణీభద్రసింహాసనం బున్న యమరావతినిఁ బాసి యరుగు టెట్లు
మధువైరిచరణాబ్జమకరందరస మైనమందాకినీనది మఱచు టెట్లు
సిరికిఁ దోఁబుట్టువై క్షీరాబ్ధి నుదయించుపారిజాతముఁ బాసి బ్రతుకు టెట్లు
దినము నైరావతము నెక్కి తిరుగకుండ
కాలినడకను నట్టిట్టు కదలు టెట్లు
నందనోద్యానవీథుల నడవకుండ
నిముసమైన నేఁ జెఱచోట నిలుచు టెట్లు. 32.

(మహేంద్రబృహస్పతులు నిష్క్రమించుచున్నారు.)

వజ్ర—ఇప్పటికి నాకమునకు దరిద్రదశయంతయుఁ దొలఁగి శోభ కలుగు కాలము వచ్చినది. దేవా! మీ రీచింతామణీభద్రసింహాసన మధిష్ఠించి దేదీప్యమానప్రభలతో కొలువుదీర్చి మాకన్నులకు విందు సేయవలయును.

పంచ—దేవా! ఇప్పు డీపీఠము నెక్కవలదు. భగవంతుఁడును దానవకులక్షేమంకరుండును నగుశుక్రాచార్యుని యనుమతంబునఁ బుణ్యదినంబున సుముహూర్తంబున మీరు సురసామ్రాజ్యపట్టాభిషిక్తు లగుట యుచితము.

నర—ఇది యవశ్య మాచరణీయము. ఇంతలో నాకలోకవైచిత్ర్యములఁ గనుఁగొందము రండు. పట్టాభిషేకముకన్న ముందు మహేంద్రుని యుంపుడుకత్తెయగు నూర్వశిని సందర్శించుటకై నామనంబు తత్తరపడుచున్నది. దానిచక్కఁదనము వర్ణనాతీతమని మున్ను నారదాదిమునులవలన వినుచుందును. కావున సత్వరము పోదము రండు.

పంచ—చిత్తము. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీ

# ప్రసన్నయాదవనాటకము.

## ద్వితీయాంకము.

[అప్పుడు మందపాలుఁ డనురాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మందపాలుఁడు—(తనలో) చీ! చీ! ఈపాడుస్వర్గమున కేలవచ్చితిని. ఈయమరావతీపట్టణమును జూచినదిమొదలు నాకు ‘పేరుగొప్ప ఊరుదిబ్బ’ యనుసామెత జ్ఞప్తికి వచ్చుచున్నది. ఈనగరము సకలవస్తుసంపన్న మనియు సకలసంపదలకు స్థాన మనియు మహావైభవసమేత మనియు పలుమారులు మహాత్ములు వేనోళ్ళఁ బొగడుచుండ విని కాఁబోలు ననుకొని నామనోరథము లన్నియు సఫలంబు లగునని పుట్టెఁడాసతో వచ్చి తుదకు మోసపోతిని. మునులుముండకొడుకులు స్వర్గముపైఁ గలదురభిమానముచేఁ దీని నంతగా వర్ణింతురేగాని దీనియం దేమిగొప్ప యున్నది? ఈమందాకినీనది యొకసముద్రమంత యున్నది. కాని యిందు నాకుఁ గావలసినచేఁపలు జెల్లలు వత్తలు పీతలు రొయ్యలు లేనేలేవు. నోటికి రుచిగా వండించుకొని తిందమన్న నింతతూఁటికూరైనఁ గాని యిక్కడ లభింపదుగదా. ఈనదికన్న మాయూరిచెఱువే నయము. ఈనదిలో బంగారపుఁదామరపువ్వు లున్నవఁట. అవి యెందుకు? దేవతలుతలలు పగులఁగొట్టుకొనుటకుఁ బనికివచ్చును. మూఁడుదినములనుండి నాకు ముంజెకాయలపై ధ్యానముపోయినది. దారిద్ర్యదేవతకు నిలయమైన యీవేల్పువీటియందు తాటిచెట్టే లేదుగదా? అన్నము తిని నీళ్లుత్రాగి యెఱుఁగని యీనిర్భాగ్యులగుదేవతలకు తాటిపండు తినునంతటి భాగ్యముకూడ లభించునా? ఈపట్టణస్థితిఁ జూడ నిందు వసియించువేల్పులు నాగరికత యెట్టిదో యెఱుఁగని మోటపసరము లని నాకుఁ దోఁచుచున్నది. పోనీ. ఆవస్తువులు దొరకకపోయిన మానె. నామనసునన్న తక్కినకోరికలైన నెఱవేఱినవా? దేవేంద్రుని పైఁ గత్తిగట్టి దండయాత్రకు వెడలు రాక్షసు లందఱుఁ గావలసినంత యమృతము ద్రావి చిరకాలజీవులు గావచ్చుననియు స్వర్గలోకమునం దప్సరసలు వేనవేలుందురుగనుక నెవనికిఁ గావలసినదానిని వాఁ డశ్రమమునఁ జేయిపట్టుకొని తీసికొనిపోయి సుఖింపవచ్చు

ననియు సేనానాయకు లగుమురహయగ్రీవులు నొక్కి పలుకుటచే కొండంతయుత్సాహముతో నేను రంభను జేపట్టి తీసికొనిపోవచ్చునని యిందువచ్చితిని. కాని యమృతభాండ మంతరించినది గడుసులాజె రంభ యేమైనదో యెవ్వరికిం దెలియదు; దానిజాడ దెలుపువాఁడు నా కెవ్వరయినఁ గనఁబడిన బాగుండును. (అని యిట్టటుఁ జూచి) అదిగో మా వజ్రకంఠుఁ డిట వచ్చుచున్నాఁడు. వీని నడిగి తెలిసికొనియెదను.

[అప్పుడు వజ్రకంఠుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వజ్రకంఠుఁడు—(తనలో) బళి! బళీ! ఈనరకమహారాజుగారు చిరకాలజీవులయి యుండుదురుగాక! ఈతనియధికారము మాచంద్రార్కము నిలుచుగాక! ఈమహాత్మునివలన నేగదా రావణకుంభకర్ణులనాఁటను తారకాసురబలిచక్రవర్తులనాఁటను లేనిగౌరవము మారాక్షసకులమునకు నేఁడు కలిగినది. కాని నరకమహారాజు మహేంద్రుని యుంపుడుకత్తె యగునూర్వశినిఁ గూడుటకయి యభిలషించుచుఁ జంద్రోదయము కాఁగానే నన్నుఁ దనవద్దకు రమ్మని యానతిచ్చె. ఇంతలో మందబుద్ధి యగుమందపాలునితో నించుక మాటలాడి వినోదించెద. వీఁ డెవరికొఱకో నిరీక్షించుచున్నాఁడు (అని ప్రకాశముగా) ఓరీ మందపాలా! నీ వెవరికొఱకు వెదకులాడుచున్నావు?

మందపా—(సమీపముగా వచ్చి) ఓరీ వజ్రకంఠా! నీ విప్పు డెం దఱుఁగుచున్నావు? నీ కెక్కడనైన రంభ యగపడలేదుగదా?

వజ్ర—ఆహా! నా కొకయాఁడుది గనఁబడినది. అది రంభయే యైయుండవచ్చును. అయిన నది యెట్లుండునో నీ వించుక యానవాలు చెప్పినపక్షమున దానిజాడ నీకు నెఱిఁగింపఁగలను.

మందపా—(సంతోషముతో) కనఁబడినదా? వెనుక రెండుమూఁడుసార్లు దానిని నేను దూరమునుండి చూచితిని. అప్పటినుండియు దానియాకృతి నామనసున నాటుకొనియే యున్నది. దాని కానవా లెఱిఁగించెద వినుము. అది చక్కనిచుక్క. దాని శరీరకాంతి తాటిపేసమువలెఁ బచ్చగ నుండును. దానితలవెండ్రుకలు మసిబొగ్గులో జీడిగింజలో యనుకొనవలయును. దానికొప్పు మాలకాకివలె నప్పుడే యావములోనుండి తీసినపిడతవలె నల్లనై పెద్దదిగా నుండును. దానిజడ యినుపగరిఁటకాడలాగున నుండును. కన్నులాలిచిప్పలు. దానిపెదవి క్రొత్తావకాయపేడువలె నెఱ్ఱనై యుండును. మొగ మిత్తడిసిబ్బివలె గుండ్రముగ నుండును. అది పువ్వులపావడఁ గట్టి యుల్లిపొరవంటి యుత్తరీయము వల్లెవాటు వేసికొని తక్కుచు తారుచు సొక్కుచు సోలుచు నిక్కుచు నీల్గుచు వంగుచు పొంగుచు నాడుచు పాడుచు నడచినప్పుడు చుక్కలలోఁ జంద్రుడులాగు గజ్జెలగోడిగలాగు రామచిలుకలాగు గోరింకలాగు పికిలిపిట్టలాగు నెమలిపెంటిలాగు

హాంసిలాగు తళతళలాడుచు మెలమెలలాడుచు జలజలలాడుచు చకచకలాడుచు పకపకలాడుచు నచ్చముగ బోగముదానివలె నుండును. వేయేల? అప్పుడు దానిం జూచిన మహామునులకయిన మనసు కరఁగక మానదు. నీ కది యెక్కడఁ గనఁబడినది?

వజ్ర—నిన్నరాత్రి కలలోఁ గనఁబడినది.

మంద—(కోపముతో) నన్నెగతాళి చేయుదువా? నీపొట్టపొడిచివెయ్యా! నీ కెప్పుడు నిటువంటిబుద్ధులే. నీనోరు మాటలాడుచున్న నీనోసలు వెక్కిరించుచుండును. మొదటనుండియు నొక్కమచ్చుననే బ్రతికినావు నీబ్రతుకు బండలుగాను. నేనా నీకు హాస్యమునకు దొరకినవాఁడను?

వజ్ర—తాతా! కోపగింపకు. ఉడుతలు పీఁకిన తాటిటెంకవలె తల గలిగి మీసములు గడ్డము నరసిన ముసలిముండకొడుకునకు నీకు రంభ గావలసివచ్చెఁగదా యని యెగతాళి చేసితిని. కాని నీ విప్పుడు రంభవిషయమయి చేసినవర్ణనము మెచ్చఁదగి యున్నది. నీవు నిజముగఁ గోరినపక్షమున రంభను గలిసికొనునుపాయముఁ జెప్పెద వినుము.

మంద—నాతండ్రీ! నానాయనా! చెప్పు చెప్పు. ఈయుపకారమునకు నే నింకొకజన్మమున నీయింటఁ గుక్కనై పుట్టి నీఋణముఁ దీర్చికొనియెదను. నాకుఁ గొడుకు పుట్టినపక్షమున నీపేరు పెట్టుకొనియెదను.

వజ్ర—ఇదిగోఁ జెప్పెద వినుము. రంభ మొదలగునచ్చరలు మనము స్వర్గమునకు వచ్చినతోడనే పాఱిపోయిరి. అయినను భయము లేదు. యుద్ధములోఁ గడతేరినవా రందఱు రంభాసంభోగము గాంతురు. అందుచే నీ వొకకత్తితోఁ బొడిపించుకొని చచ్చి పొమ్ము. అప్పుడు నీకు రంభపొత్తు గలుగును.

మంద—అదిగో మరల హాస్యము నారంభించినాఁడవు. నే నదే వద్దన్నది. నాకుఁ గోపము వచ్చినయెడల నేను మంచివాఁడనుకాను. కాఁబట్టి యామాటను మాని నే నడిగినదాని కుత్తరము చెప్పుము. రంభ పాఱిపోయినదిసరే. ఊర్వశి మన కేమయిన కొంచె ముపకారము సేయునా?

వజ్ర—ఔరా! పిడుగా నీకడుపులో నెంతయూహ లున్నవిరా! మహారాజుగారు మోహించినయూర్వశియే నీకుఁ గావలయునుగా! సరే! జాగ్రత్తగా నుండు. ఈమాట మహారాజుగారితోఁ జెప్పి నీడొక్క చీలించి ప్రేవులు తోడించి గ్రుడ్లు పీఁకించి వెన్ను చీరించి చెంపలు పగులఁగొట్టించి బుగ్గలు సాగఁదీయించి పిఱ్ఱతో ళ్ళెగరఁగొట్టించి మోకాళ్ళచిప్పలు తీయించి నాలుక కోయించి తల గొరిగించి గాడిదమీఁద నెక్కించి

యూరేగించి కొఱతను వేయింపకపోయిన నా పేరు వజ్రకంఠుఁడు గాఁడు. మహారాజుగారియంతరమేమి నీయంతరమేమి తారతమ్య మెఱుఁగక మాటలాడెదవా?

మంద—(వజ్రకంఠునికాళ్ళపైఁబడి) నాతండ్రీ! నన్ను రక్షింపుము. బుద్ధినేరక నోటి వట్టిపుకూఁతలు కూసితిని. మఱియొకసారి నే నిట్లు ప్రేలుదునేని నన్ను నీచిత్తము వచ్చినశిక్ష చేయింపుము. కావలసినవాఁడవుగదా యని నీవద్ద నిట్లంటినిగాని యదితప్పైనచో మరల నందునా?

వజ్ర—సరే! నిన్ను రక్షించితిని. ఇఁకముం దిట్టిమాట లెన్నఁడు ననకుము. ఇఁక నేఁ బోవలయును నన్ను విడువుము.

మంద—(లేచి) నీదయచేత నిప్పటికి గండముగడపి బ్రతికి బయటఁబడితిని. నీ విప్పు డెక్కడికిఁ బోయెదవు.

వజ్ర—నరకమహారాజుగా రూర్వశీవిరహతాపమున కోర్వక యీరాత్రి వెన్నెలలోఁ బువ్వులపాన్పుపైఁ బవ్వళింతురు. ఊరడించుటకు ప్రియభృత్యుఁడ నయిన నే నాయనప్రక్క నుండవలయును. ఎన్నివర్తమానముల నంపిన నూర్వశి మహారాజువద్దకు రాలేదు. అందుచే నామెను దోడితెచ్చుటకు సేనాపతి యైననిశుంభుని మహారాజుగారు పంచినారు. ఎట్లయిన చంద్రోదయ మగునప్పటికి నే నక్కడ నుండవలయు.

మంద—అదిగో విబూదిపండో ముగ్గుబుట్టయో తగరపుపళ్లెమో యన్నట్లు చంద్రమండల ముదయించుచున్నది. నీ వింక సత్వరము పో. నామాట నచ్చట బైలుపెట్టకుసుమా! రంభ నీకగపడినప్పుడు నాతోఁ గొంచెము చెప్పు.

వజ్ర—వేయేండ్లు తలక్రిందుగఁ దపస్సుచేసిన రంభకు నీవంటిరసికుఁడు దొరకఁడు. ఆమెను నీవే వెదకికొనుము. నే వెతకఁజాలను.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

[అప్పుడు దేవేంద్రమందిరముముంగల నొకచంద్రకాంతవేదికమీఁదఁ బువ్వులపాన్పుపైఁ గూర్చుండి నరకాసురుఁడు వజ్రకంఠునితోఁ గూడి ప్రవేశించుచున్నాఁడు.]

నర—ఓరీ! వజ్రకంఠా!

చ. అదిమితి నష్టదిక్పతుల నాహవభూమి నటన్న సంతసం
బొవవ దొకింత; రాజ్యరమ నూనితి నంచు మనంబునందు స
మ్మద ముదయింప దించుకయు మక్కువమై నొకసారి యూర్వశీ
పదయుగము న్భజింపఁ గలభాగ్యము నాకు లభింప కుండుటన్. 1.

వజ్ర—దేవా! ఆకోరికయు మీ కచిరకాలంబునఁ దీఱఁగలదు. ఊర్వశిం దోడి తెమ్మని మీరు ధననిశుంభుని బంపియున్నారు గదా! అతఁడామె నీపాటికి వెంటఁ బెట్టుకొని వచ్చుచుండునని నే నూహించెద.

నర—ఆహాహా! నా కంతభాగ్యము లభించునే? ఒకవేళ లభింపఁ దలఁచుకొన్నను దుస్సహ మయిన యీవిరహతాపము నన్నంతవఱకు బ్రతుకనిచ్చునని నాకుఁ దోఁచదు. ఈమదనునకుఁ దోడగుట కదిగో శీతమయూఖుఁ డుదయించినాఁడు.

తే. గీ. కలసి వేల్పులు భుజియించుకంచ మనఁగ
చంద్రబింబము వెలుఁగొందుఁ జదల నదిగో
సురలు దినువేళఁ గంచముచుట్టుఁబడిన
మెతుకులట్టులు చుక్కలు మెఱయుచుండు. 2.

వజ్ర—మహాప్రభూ! మీరు సరిగా వర్ణించినారు. ఆకంచములోఁ బెట్టినప్రాఁత యుసిరికపచ్చడిముద్దవలెఁ జంద్రునిలో మచ్చకనఁబడుచున్నది.

నర—ఓ చెలికాఁడా!

తే. గీ. విరహతాపాతిశయమున వెచ్చ నూర్చి
వికలచిత్తులై యున్న కాముకులఁబట్టి
నూటి బోడిచెడు వజ్రంపుటీఁటె లనఁగఁ
జంద్రకిరణము ల్వ్యాపించె జగతియందు. 3.

మఱియు

శా. నీరేజప్రభవాండ మంతయును నిండె న్వెన్నె, లత్తత్పయః
పారావారతరంగమాలల కనుప్రాసంబులై దివ్యత
న్వీరంగన్నవమందహాసములకున్ నెయ్యంబులై సారక
ర్పూరక్షోదపరాగపుంజములకు న్బోరానివియ్యంబులై. 4.

వజ్ర—ఈవెన్నెలకతమున బ్రహ్మాండ మంతయు సున్నపుఁగడవవలెఁ దెల్లనయి యున్నది.

నర—ఈచంద్రమఃకాఁకలకు నాపువ్విలుకానిఢాకలకు నాశరీర మింక నిలుచుట యరిది. ఈశశాంకుని శాతశరములుగాని శీతకరములుకావు. సుధాంశుఁ డని పేరొంది నిప్పులం జెరుగుచున్న నితఁడు పయోముఖవిషకుంభముసుమా! అందుచేత నే—

తే. గీ. వనజనాభునికైన నవ్వజ్రికైన
నగ్నిదేవునికైన నంత్యమునికైన

వెఱచి యెఱుఁగని నే నిప్డు వెఱవవలసె
నిండునెలకును బండువెన్నెలకు నకట! 5.

వజ్ర—కామలరోగము గలవానికి జగ మంతయుఁ బచ్చగఁ దోఁచునట్లు మదనతాపముగల మీకుఁ జల్లనివెన్నెల పీడాకరముగఁ దోఁచుచున్నది కాఁబోలు. చన్నీట దిగినదున్నపోతువలె నే నీవెన్నెలలో హాయిగ నున్నాఁడను.

నర—ఓరీ! నీకు బలె నా కీజాబిల్లి సుఖప్రదముగ లేదు. నేను త్రిదివముపై దండువిడిసి మహేంద్రాదిదిక్పాలకుల రణరంగమున నోడించిపుచ్చి నాకమునుండి యమరులఁ బాఱఁదోలితి నని మనసునఁ గ్రోధము నిలిపి యమరపక్షపాతు లగుమన్మథహతకుఁడు మొదలగువారు హళాహళి మెఱయు నన్నేఁచుచున్నవారు. చూడు—

సీ. మందవీజనములు మాటిమాటికి వీచి కసి మసంగఁగఁ జొచ్చె గాలివేల్పు
చలివెలుంగులపేరి పలుబల్లెములఁ గ్రుమ్మి సంహరింపఁగఁ జొచ్చెఁ జందమామ
కలువరేకులపేరి కఱకుఁగత్తులఁ జీల్చి పగఁ దీర్చుకొనఁజొచ్చెఁ బంచశరుఁడు
నవలతాంతములతో నందనమ్మును నింపి యలయింపఁగాఁ జొచ్చె నాకునిద్ర
అక్కటకట వీరియం దొక్కఁడొకఁడె
జగము లొక్కొక్క కడకుఁ దేఁజాలు ననఁగ
దుర్మదమున నీదుష్టచతుష్టయంబు
చేర నొక్కతావున కింకఁ జెప్ప నేల? 6.

వజ్ర—(తనలో) ఈయన యిప్పు డూర్వశిపైఁ గలమోహముచే సమస్తమును మఱచియున్నాఁడు. వీనిమనసును మఱియొకవిషయముమీఁదికి మలఁచెదను. (ప్రకాశముగా) దేవా! స్వర్గలోకము జయించియు మీరు విజయఫలము ననుభవింపకున్నారు. ఒక్కసారి యచ్చరలయాటలం జూచి గంధర్వులపాటలు విని మందారపువ్వుదామముల మెడఁ దాల్చి నందనోద్యానమున విహరించి మేరుగిరికూటముల నెక్కి సురదీర్ఘికల జలక్రీడఁ గావించి సుఖించి యమరావతిని గొల్లలాడి మాకన్నులకు విందొనరింతురుగాక యని ప్రార్థించుచున్నాఁడను. అమృతకలశము కామధేనువు చింతామణీరత్నము మనపాలఁ బడునేమో యను నీసున నింద్రహతకుఁడు వానిని ఘనము రాకమున్నె తరలించుకొనిపోయె. ఉన్నవైనను మనసార ననుభవింపవలదే?

నర—వజ్రకంఠా!

తే. గీ. నందనోద్యానవన మేల నాక మేల
కామగవి యేల మణి యేల కల్ప మేల

యప్సరస లేల యింక నాకమృత మేల
చెలియ యూర్వశి ననుఁ గృప సేయుకున్న. 7.

మఱియు నామనోనిశ్చయ మొక్కసారి వినుము.

సీ. ఈవెన్నెలల వేల్పుటెలనాగతోడి సయ్యాటలేకాని యేయాటలొల్ల
నొప్పులగని యైనయూర్వశీరమణిసంగాతమేకాని సంగీత మొల్ల
వగ లెల్ల మఱపించు సొగసులాడిపిసాళినవ్వులేకాని యేపువ్వు లొల్ల
నతనుతాప మడంచు నాకాంత యేకాంతసేవలేకాని యేసేవ లొల్ల
అమరగణికాతిలకమకుటములె కాని
కనకగిరికూటముల నొల్ల గడియయైన
కోమలాంగి సిగ్గులు కొల్లఁగొనుటె కాని
అమరనగరంబు నేఁ గొల్లలాడ నొల్ల. 8.

వజ—సరే! మీనిశ్చయము తెలిసినది. మీ రీవేల్పుభోగములతో తుకూఁతుపాత్తు మరగి ప్రపంచమే మఱచియుందురు. ఈవీలు చూచి దురాత్ము లగునిర్జరులు మరల విజృంభింతురు. అంతట పండిపోయినచెఱువులోఁ జేఁపలవలె బయలుపడి మేము నశింతుము. ఊర్వశికన్న మిన్నలగు వెలయాండ్రు భూలోకంబున నెందఱు లేరు దీనికయి యింత దురపిల్ల నేల?

నర—ఓరీ! నాకవేశ్యలకు భూలోకవేశ్యలకుఁ గలతారతమ్య మెఱుఁగని యరసికుఁడ వగుటచే నీ వి త్తెఱఁగునఁ బ్రేలఁ జొచ్చితివి. ఆభేదముఁ జెప్పెద వినుము.

వజ—వద్దువద్దు చెప్పనక్కర లేదు. నే నాభేద మిదివఱకే యెఱుఁగుదును. భూలోకవేశ్యాకాంతలకుఁ బలె స్వర్గవారకాంతలకు విటులయెడ్లుకలు కటకట కొఱికి వేధించుకొని తినుతల్లిముండ లుండరు. నెత్తురు పీల్చుజలగలట్లు మర్త్యవారాంగనలు విటునిధన మెల్ల హరించి యిల్లు గుల్లఁజేసి తిరిప మెత్తింతురు. సురవేశ్యలకు సొమ్ముక్కర లేదు. కాని మనుజలోకమునందలి పణ్యాంగనలకుఁ జావుండుటచే నెప్పటికయిన విరుగడ యయిపోవుదురు. ఈస్వర్గలోకపుబానిసకూఁతులకుఁ జావు లేదు. పాపీ చిరాయు వన్నట్లు బ్రతుకుదురు. ఇదియే నే నెఱిఁగినభేదము.

నర—ఓరీ! నే నడిగినభేదము సౌందర్యవిషయమున. ఇటు విను—

ఆ. వె. ఎంతకాలమైన నెలజవ్వనమె నిల్చు
మదిమి రాదు నెడదు మోవికావి
నిడుదకనులబెళుకు నెమ్మేనితళుకును
నంతకంత కెచ్చు నచ్చరలకు. 9.

వజ్ర—నాకంటి కాఁడువాండ్రందఱు సొగసుగ నేకనఁబడుదురుగావున చక్కఁదనమున నెక్కువతక్కువలు నిర్ణయింపఁజాలను. కాని మీపలుకులంబట్టి వేల్పువెలయాండ్రకు మరణము లేకపోవుటయేగాక ముదిమియు లేదని తేలినది. పోనీ. అందఱకొంపలు దీయుచు తాళ్ళలాగున బ్రతుకనిమ్ము.

నర—వజ్రకంఠా! మననిశుంభుఁ డేలకో కడునాలస్యము చేయుచున్నాఁడు. ఊర్వశి వానికిఁ గనఁబడియుండదా? కనఁబడిన రానొల్లదా? ఆలస్యకారణ మేమో నీవుపోయి తెలిసికొనివచ్చెదవా?

వజ్ర—నా కింతకన్న నుద్యోగ మేమున్నది? అట్లే పోయెదను. ఓ దైవమా! అందఱు నాచుట్టునుదిరిగి నాకాళ్ళపైఁబడునట్లు నన్నొకస్వర్గలోకపు భోగముదానిగఁ జేయక యీదిక్కుమాలినపుట్టుక యేల పుట్టించితివి? (అని కొంచెమునడిచి) అమ్మయ్యా! నాయదృష్టము బాగున్నది. ఊర్వశిం దోడ్కొని యదిగో నిశుంభుఁ డిటనే వచ్చుచున్నాఁడు.

నర—(దిగ్గునలేచి) ఏది? ఏది? నాయాఅప్రాణము?

వజ్ర—అదిగో! మననిశుంభునివెనుక నడుగులు లెక్కపెట్టుకొనుచుఁ దలవంచుకొని పెళ్ళికూఁతురువలె నడచి వచ్చుచున్నది.

నర—వజ్రకంఠా! మహేంద్రుఁ డూర్వశి నిచ్చట విడిచిపోవుటచేఁ గామగవియు నమృతభాండము మొదలగు దివ్యవస్తువులను దివమునుండి తరలించుకొనిపోయె నని నా కిప్పుడు విచారములేదు.

క. నాపాలిసురభి యిదియే
నాపాలిఁటిపారిజాతనగ మియ్యదియే
నాపాలియమృత మిదియే
నాపాలిఁటిరత్న మిదియె నానిధి యిదియే. 10.

వజ్ర—వెట్టికి వేయివిధములు. అందులో నిది యొకటి.

నర—ఓరి మూర్ఖుఁడ! జగన్మోహన మగుదానియాకార మొక్కసారి కన్నులకఱవుదీరఁ జూడుము. ఆహాహా! నాకన్ను లింతకాలమునకుఁ జరితార్థత నొందినవి.

సీ. లావణ్యమును గ్రక్కులలనమోమును జూచి చూడ నక్కఱలేదు సోము నింక
సిరికిఁ దానక మైనచెలువఁ జూడ్కిఁ దలంచి తలఁప నక్కఱలేదు తమ్మితేకు
మిఱుమిట్లు గొలుపు నెమ్మేనివన్నియ నెంచి యెంచ నక్కఱలేదు మించుమాట
యుండిలేనటు లుండు నువిద నెన్నడుము పెన్ని యెన్న నక్కఱలేదు మిన్నత్రోవ

తేటతేనియబావియౌ తెలవమోవి
చెప్పి చెప్పనక్కఱలేదు చిగురుపేరు
పొలఁతి జఘనమండలి పొంతఁబోయి పిదప
పోవఁ బనిలేదు మిన్నేటిపులినములకు. 11

మఱియును.

ఆ. వె. ఇంతికన్నులుండ నింపువిల్కానికిఁ
దూణ మేల? వేఱుబాణ మేల?
కలికిఁ బ్రాపుఁ బడసి కాఁబోలు మఱుఁ డిట్టు
లాడలు మఱచి తిరుగుచున్నవాఁడు. 12.

[అప్పుడు నిశుంభుఁ డనురాక్షసుఁడు, ఊర్వశితోఁ బ్రవేశించుచున్నాఁడు.]

ఊర్వ—(తనలో) రంభాదులగు నచ్చరల యదృష్టములు తిన్ననగుటచే వారీదురాత్మునిదృష్టిపథమునఁ బడకుండ నావలకుం దాఁటిరి. మందభాగ్యురాల నగు నేనంతటిపుణ్యము చేసికొననైతిని. ఇంతకు విధినియోగము దుస్తరము. అచ్చరనైన నేమి? వేల్పుదొరప్రాపకము గాంచిన నేమి? ఇడుమలు గుడువవలసినకాలము వచ్చినప్పుడు తప్పునా? రాక్షసులే తులువలు. అందు నరకుఁ డధమాధముఁడు. వానియనుచరుల చర్యలం జూచి మహాపాతకు లందఱు తలలు వంచుకొనవలయు. వీనియెదుటికి రాకయుండమని యెన్నివిధములఁ బ్రయత్నించినను సాగదయ్యె. అయినను బడఁతుల బలిమి బట్టి మానభంగము సేయు నరకహతకునిబారినుండి తప్పించుకొనుటకు దైవ మేదయిన నొక్కయుపాయము దోఁపింపఁడే? (తలవంచి నిలుచున్నది.)

నిశుం—(తనలో) స్వామి కేది మనఃప్రియ మగునది సేయువాఁడె విశ్వాసము గలసేవకుఁడు. యజమానులయాజ్ఞఁ జెల్లింపక వారిమేలుకొఱకే వారిమాటలు మేము నిరాకరించుచున్నవార మని చెప్పుసేవకులు కేవలము కృతఘ్నులు దండ్యులు నని నాయభిప్రాయము. మంచిదెకాని చెడ్డదెకానీ రాజాజ్ఞ చెల్లి తీరవలయు. అందుచేత నేయూర్వశివిరహతాపమున దురపిల్లుమహారాజునకు నేను వాంఛితార్థసిద్ధిఁ జేసితిని. నా రాజభక్తికి నరకుఁడు శాశ్వతకాలముఁ గృతజ్ఞుఁడై యుండు (రాజును సమీపించి ప్రకాశముగా) మహారాజా! జయము! జయము!

నర—మిత్రుఁడా! నీవు కావించినమహోపకారమునకుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాఁడను.

నిశుం—దేవరవారికి నేను జేయవలసినపనియే జేసితిఁ గావున స్తోత్రమునకనర్హుఁడ.

వజ్ర—ఈనిశుంభునకు సైన్యాధిపత్యముననున్న నేర్పుకంటె మహారాజునకు మిండకత్తెలను దార్చుటలో నెక్కువప్రజ్ఞ యున్నట్టు కనఁబడుచున్నది. వాని నింక మీఁద నిట్టియుద్యోగములో నుండుటయే మంచిది.

నిశుం—ఓరిమూర్ఖుఁడా! వజ్రకంఠా! సింగము నాశ్రయించిన నక్కవలె రాజాశ్రయమున నీవు నిర్భయముగఁ జరించుచున్నాఁడవు. ఇప్పు డీమహారాజుమొగముఁ జూచియేసుమా నీప్రాణంబులు నీశరీరములోనే నుండనిచ్చినది.

నర—మిత్రమా! ఈయవ్యక్తునిమాటలు మొదటనుండియు నీ వెఱిఁగినవేకదా?

నిశుం—దేవా! వానిమాటలు నేసరకుసేయ. ఇదిగో యూర్వశి వచ్చి జంత్రపుబొమ్మవలె నిలుచున్నది. దేవర యపాంగావలోకనముల దీనిపైఁ బరపి మన్నింపుఁడు.

నర—మిత్రుఁడా!

తే. గీ. వేయుఁగన్నుల ననయంబు వేల్పుఱేఁడు
తరుణిలావణ్యమును జూచి తనివిసనక
యున్నవాఁ డనఁ నేఁ దృప్తి నొందఁ గలనె
కనులు రెండింటితో నొక్కగడియ చూచి. 13.

గౌతమశాపము మహేంద్రునకు నిజముగ నీవిషయమున వరమె యైనది. ఈసమయమున నేను సహస్రాక్షుఁడను గాకపోవుటయు నొకలోపమె.

వజ్ర—అది యెంతభాగ్యము. ఏమునియో పట్టఁజాలనికోపము వచ్చినప్పుడు మన కంతటిభాగ్యముఁ గలుగఁజేయకపోఁడు.

నిశుం—ఊర్వశీ! కొయ్యబొమ్మవలె నిలిచియుండెద వేల? మహారాజునకు మ్రొక్కుము.

ఊర్వ—(తనలో) కటకటా! మహేంద్రునకు వేల్పులనిండోలగంబున జోహారుఁ జేయుచేతులతో నీదానవాధమునకు మ్రొక్కవలసె. (ప్రకాశముగ) దానవేంద్రా! నమస్కారము.

నర—(తనలో) దీని నిప్పు డేమని దీవింతును? నామనసులోనిభావము తేటఁబడున ట్లాశీర్వదింపవలెను. (ప్రకాశముగ) ఓత్రిభువనరత్నమా!

మ. త్రిజగన్మోహనమై దివాభరణమై దేవేంద్రునిత్క్షేపమై
యజనిర్మాణముకన్నఁ బ్రౌఢతరమై యామన్మథోద్యజ్జయ
ధ్వజమై కన్నులపండువై లలితమై ద్రష్టవ్యమై చాల న
క్కజమౌ నీనెఱిజవ్వనం బలరు త న్గళ్యాణియెల్లప్పుడున్. 14.

వజ్ర—తథాస్తు.

ఊర్వ—(తనలో) ఈదురాత్ముఁ డపూర్వమైన యాశీర్వచనముచేఁ దన నింద్యమగుభావమును వెల్లడి చేయుచున్నాఁడు. అయ్యో! నా కీదినమైన నేఁడియో కీడుమూఁడ నున్నది.

నిశుం—ఈదేవనకామె యలిగి మీపై కోరచూపులఁ బ్రసరింపఁజేయుచున్నది.

నర—అట్లయిన నామె చూపులను నేను బ్రసన్నములుగఁ జేసికొనెద.

ఓలావణ్యరాశీ!

మ. చెలులై తేంట్లకు సోగలై వెడదలై చెంగల్వచుట్టంబులై
జలజాతంబుల నేలునట్టి దొరలై సౌభాగ్యపుందీవులై
కలుము ల్జిమ్మెడుక్రొవ్వులై కఱకులై కందర్పువాల్తూపులై
చెలువొప్పారెడు నీదు చూపులకుఁ నాశీర్వాద మబ్జాననా! 15.

వజ్ర—తథాస్తు.

నిశుం—ఈపలుకులంబట్టి మీరు శతమన్యునికంటె నూరుమడుంగు లెక్కుడు రసికులని యూర్వశి యిప్పుడయిన తెలిసికొనకపోదు.

వజ్ర—ఆయన నూరురెట్లు రసికుఁడు. ఆయనబంటవు నీవేఁపదిరెట్లు రసికుఁడవు.

నిశుం—ఓరీ! తులువా! నీపాడునోటికి బుద్ధిచెప్పుట కిది సమయముకాదు (రాజుతో) దేవా! మురహయగ్రీవులు నారాక నిరీక్షించుచుందురుగావున శిబిరమునకుఁ బోవ నానతిండు. యూర్వశి లేనిపోని బోగము లెక్కులు చేయక ప్రసన్నురాల వయి మహారాజు ననుగ్రహము సంపాదించుకొనుము.

నర—నీమేలు నేను మఱచిపోను నీ విఁక శిబిరమునకుఁ బొమ్ము.

నిశుం—చిత్తము. మీబంటున కదియే కావలసినది. (అని నిష్క్రమించును)

వజ్ర—(తనలో) ఇప్పుడు మారాజునకు శనిగ్రహము వదలినట్లే యున్నది.

ఊర్వ—దానవేశ్వరా! దేవరవారు నన్నుఁ బిలిపించినకారణ మేమో తెలియఁ గోరుచున్నాను.

వజ్ర—తొందరపడకు. స్వల్పకాలములోనే తెలిసికొనఁగలవు.

నర—ఓసుందరీ!

ఉ. ఇన్నెలరాలతిన్నియల నిన్ననపాన్పుల మేను జేర్చి యీ
వెన్నెలరేల నేనిటుల వేఁగుచు వన్నెదొఱంగి యుండుటల్
కన్నులఁ జూచియు న్నిలువఁగాఁ గత మేమని నంగనాచివై
నన్నడుగం దలంచు టిది న్యాయమె కారణ మీ వెఱుంగవే? 16.

అయినను దత్కారణము నీవు నానోట నే వినఁ దలఁచుచున్న దానవుగావున నేఁ జెప్పక పోవుట పాడి కాదు. సహస్రాక్షుని గెలిచి యమరసామ్రాజ్యాధిపత్యమును నేను గైకొంటినిగాని నీవు లేనిచో నింద్రత్వము పరిపూర్ణము గాదు. స్వర్గరాజ్యలక్ష్మి నీతోఁ జిరకాలముఁ గలసిమెలసి యుండుటంజేసి తా నొంటిగ నాకడ నుండ నొల్లకున్నయది. కారణము తెలిసినదా?

వజ్ర—దేవా! దీనికి స్పష్టముగ విప్పిచెప్పినంగాని తెలియదు.

నర—అట్లయిన నిదిగో విస్పష్టముగఁ జెప్పుచున్నాఁడ.

తే. గీ. ఇంచువిలుకాఁడు నన్నది యేమొ కాని
యేఁచుచున్నాఁడు సైన రొక యింతలేక
మునితోఁ జెప్పి యాపీడ మాన్పఁ గదవె
మునుఁడు వినకున్న నీవైన మాన్పఁదగవె? 17.

వజ్ర—ఈమాత్రపుఁగార్యమునకు నీమె నింత వేఁడవలయునా? నాకలోకవేశ్యలలో నూర్వశి పెద్దపిన్నతారతమ్యము లెఱిఁగినయోగ్యురాలు. మఱియు నిది దానిచేతిలో నున్న పనియే గనుక నీమాట త్రోసివేయదు.

ఊర్వ—(తనలో) ఆహాహా! ఆయజమానున కీసేవకుఁడు దగినవాఁడె. ఈరాక్షసాధముఁడు కామాయత్తుఁడయి యొడలు దెలియక యున్నవాఁడు. వీనికి నే నిప్పుడేమి యుత్తరముఁ జెప్పుదును. (అని యాలోచించుచున్నది.)

నర—(తనలో) ఇది నామాట కుత్తరమీయ కున్నదేమి? (ప్రకాశముగ)

మ. అనుమానించెద వేల సుందరి యహల్యాజారుఁడ న్నేను గా
ననియో కన్నులు వేయి లే వనియొ నా కయ్యింద్రునం దున్న పే
ర్గానము ల్నాకడఁ గానరా వనియొ నీలోఁ జింత నే నెట్టు లు
న్నను మీయింద్రునిపాటి సేయనఁటె కాంతా చింత నీ కేటికే! 18.

ఊర్వ—దేవా! ఎదుట లేనిమహేంద్రుని దెప్పుట తగవుకాదు. వారిగుణములు మీకురావు; మీగానములు వారికిరావు. వారంతవారు వారు. మీయంతివారు మీరు.

వజ్ర—సరే! నాయంతవాఁడను నేను. నీయంతదానవు నీవు.

నర—ఓకళ్యాణీ! నీ కిష్టము లేదుగావున నింక మహేంద్రునిమాట నే నెత్తను. కాని నాప్రార్థన మంగీకరించి నాయంతిపురమునకు రమ్ము. నావలన నేభయంబును నీవు పడనక్కరలేదు.

మ. పౌలఁతీ కన్నులఁ గప్పుకొందుఁ బువులం బూజింతు నిన్నా స్ననం
బలరం బట్టపుదేవిఁ జేయుదును నీయాజ్ఞం దలం దాల్తు వే

ల్పల కెల్లం దొరసాని వయ్యెదవు మాప్పొద్దు న్నినుం గొల్తురై
త్యులిఁక న్నీకనుసన్నల న్మెలఁగి చేతుల్మోడ్చి నీభృత్యులై 19.

మఱియు నింద్రునికడ నీవనుభవించిన దానికంటె వేయిమడుఁగులు మహైశ్వర్యము ననుభవింపఁగలవు. అదియునుగాక!

తే. గీ. ఇంతకాల మింద్రునిగూడి యెటిఁగితి గద
యతనిసరసత్వ మతనియొ ప్పతని నేర్పు
చిగురుఁబోఁడి కొన్నాళ్లు చూచెదవు గాక
నాదురసికత నాసొరు నా తెఱంగు

ఊర్వ—దానవేంద్రా! దుర్నిరీక్ష్యతేజోరాశివై శ్రేయఃకాముఁడ వైన నీనోట నుండి యిట్టిపలుకులు రానిచ్చుట కేవల మనుచితము.

వజ్ర—అబ్బో! ఇది శ్రీరంగనీతులు చాల నేర్చినది.

నర—ఊర్వశీ! ఇది యేటిసరసమే?

మ. వనితా ప్రాపకు లాటకు న్సరసు లెవ్వారైన రావారి గ
న్గొని లాలించుట యొప్పగాని విరసోక్తు ల్పల్కి తచ్చిత్తరం
జనము న్జేయకఁ జెంగనాడుదురె వేశ్య ల్గారె మీ రింక చా
లును మీసానిఱికంబు లింతటివశే లోకుల్ నినున్ నవ్వరే? 21.

వజ్ర—అయ్యో! ఇది సరసురాలు గానట్టు నటించుచున్నదిగాని సరసము లేక పోలేదు. ఇది యెన్నెన్నోకొంపలు గాల్చిన కొఱవిగాని సామాన్యురాలు గాదు.

ఊర్వ—దేవా! మహారసికు లయినదేవరచిత్తము రంజనము జేయఁగలపాటిరసికత నావద్దలేదు.

నర—సుందరీ! ఇది నిశ్చయముగ గర్వోక్తిసుమా!

తే. గీ. ఎంతరసికురాలవొగదే యింతి నీవు
ఎంతదానవు గాకున్న నింద్రుఁ డట్టి
ముజ్జగంబుల దొర కేలుమోడ్చి నీకు
దేవసంతతితోడ విధేయుఁ డగునె? 22.

మఱియు

తే. గీ. ఎల్లజగముల గెల్చె దేవేశ్వరుండు
అతని గెల్చితి నేను బాహాబలమున
నన్నుఁ గెలిచితి వీవు విన్నాణమునను
నిన్ను సామాన్యురాలన నేర్తు నెట్లు? 23.

వజ్ర—మహాప్రభూ! ఏలినవారు నిజము గ్రహించినారు.

ఊర్వ—రాక్షసేశ్వరా! చక్కఁదనమున నెఱజాణతనమున నన్నుఁ బూరికిం గైకొననిప్రోడలు స్వర్గమర్త్యపాతాళములయందు మీకుఁ గావలసినంద ఱుండఁగ నెన్నఁడో యౌవనమంతయుఁ బోయిన ప్రాఁతదానను నన్నుఁ గోరెదరేల?

వజ్ర—ఈవగలాఁడి మిమ్మును బుట్టలోఁ బెట్టుటకుఁ బ్రయత్నించుచున్నది. జాగ్రత్త.

నర—ఏమి! నీవు యౌవనము సెల్లిపోయిన ప్రాఁతదానవా?

తే. గీ. ప్రాఁతపడియును బంగారు వన్నె చెడునె?
ప్రాఁతచెట్టులు తియ్యనిపండ్ల నిడవె?
ప్రాఁతదయ్యును జాఁబిల్లి పసచెడియెనె?
ప్రాఁతకొత్తలేమిటికి సువస్తువులకు? 24.

వజ్ర—ప్రాఁతమానులు చేవఁదేరునట్లు నీమె ప్రాఁత దాటచే నెక్కుడుజాణగా నున్నది. మఱియు ప్రాఁతవస్తువులు పథ్యములని చెప్పుదురు. కావున నీమెపొందు మీకుఁ బథ్యమే!

ఊర్వ—నాయందు మీకుఁ గలయనురాగాతిశయముచే మీకన్నుల కట్లు నేఁ గనఁబడుచున్నదానను.

నర—కాంతా! అట్లు గాదు.

తే. గీ. మెఱుఁగుపుఁదీఁగెకు వన్నెలు తఱుగునేని
కలికి నీమేనిజగ్గులు కగ్గవచ్చు
పుట్టతేనియలోఁ దీపు పోవునేని
పొలఁతి నీయందు రసికత పోవవచ్చు. 25.

ఊర్వ—నరకమహారాజా! జన్మమునుబట్టి నే నొకపణ్యాంగన నైనను సకలజగజ్జనకుఁ డగుమహేంద్రునకు వలపుగత్తెనై యుండుటంజేసి నే నట్టియోగ్యతకుఁ దగియుండకపోయినను నింద్రునియందలి గౌరవమున నైన లోకమాతగాఁ బరిగణింపఁబడవలసినదానను.

నర—(ఆశ్చర్యముతో) ఏమీ! లోకమాతవా!

తే. గీ. మగువ నీయందు నింతింతమహిమ లుంట
యింతకాలంబునుండి నే నెన్నఁ డెఱుఁగ
క్రొత్తసంగతు ల్నేరిచికొంటి నహహ
ప్రాఁతలంజె లిప్పుడు లోకమాతలైరి. 26.

వజ్ర—ఓహోహో! ఇది లోకమాతయఁట! మా కందఱకు తల్లినని బైలుదేరెను గాఁబోలు. అట్లయిన నీవె మాపాలిటి పెద్దమ్మయె.

ఊర్వ—అసురనాయకా! నేను లోకమాతననుట నీకు హాస్యాస్పదముగ నున్నయది. అట్లయిన నిటు విను ‘పితృసమో జ్యేష్ఠ’ యను శాస్త్రవచనమునుబట్టి మహేంద్రుఁడు నీ కగ్రసహోదరుఁ డగుటచే నే మీకు వదినెనైతిని. మోహ మెంత యున్నను వావియైన దలఁపవలదా ?

వజ్ర—ఇష్టము లేనప్పుడు కులటలు వావివరుసలు వెదకుదురు.

నర—ఓహో! ఇప్పుడు నీకు వావివరుసలు గావలసివచ్చినవా? నీపూర్వచరిత్ర మించుక దలఁచుకొనుము. కాదుకాదు. నేనే జ్ఞప్తికిఁ దెచ్చెద వినుము.

చ. నెలఁతరో యేమి కావలయు నీ కలపాండవమధ్యముండు నీ
గళమునఁ దాళిగట్టినమగం డటె నీకు బురూరవుండు నీ
చెలియగునట్టి మేనకకుఁ జేరువచుట్టమె గాధిపట్టి వా
వులు వెదకం దలంచెదవు బోగముబోటికి వావులేటికే? 27.

ఊర్వ—(తనలో) ఇతఁడు నాప్రాఁతతప్పు లన్నియుఁ బైలుపెట్టుచున్నాఁడు. ఇఁక నేమివాకఁ జెప్పుదును.

వజ్ర—సూదికొఱకు సోదికిఁబోవఁ బ్రాఁతఱంకులు బైటఁబడినవఁట. ఈకథయట్లున్నది.

ఊర్వ—రాజా నే నెవ్వతెనైనను నీకుఁ బరకాంతనుగదా ?

నర—పరకాంత నెట్లగుదువు? వేశ్యవగుటచే నందఱకు సామాన్యకాంతవు.

తే. గీ. ఎవఁడు ధన మిచ్చు మీకు వాఁడె మగఁ డంచు
బ్రహ్మ మీఁదుబంతులఁ దీర్చి వ్రాసె నుదుట
గడుసుపోకడ లిఁకఁ జాలుఁ గట్టిపెట్టు
సకియ నీయాట లిచ్చట సాగిరావు. 28.

ఊర్వ—అనురాగము లేనియబలను బలిమిం బట్టిలాగుట యధర్మము కాదా ?

నర—ఏమి! మా కిప్పుడు ధర్మోపన్యాసములు సేయవచ్చితివా ?

చ. జిలిబిలితేనెపల్కులను జెన్నగుతళ్కులు వాలుచూపులన్
జెలువపుఁగోపులన్ రకపుఁజిన్నెలు వన్నెలు పెన్వగల్ నగల్
నిలుకడలేని హాసములు నింప్యపువేసములు న్ధరించి లో
కులఁ బడఁద్రోయువేశ్య లిటఁ గ్రొత్తగ నేర్చిరె కొన్నిధర్మముల్. 29.

మఱియు

తే. గీ. దనుజులము మేము మాకేల ధర్మమేల?
వావి వరుసల నెన్నెడువారు వేరు
వేల్పు లెవరైన నినుఁ గోరి పిలుతురేని
వారికడఁ జెప్పు నీనీతివర్తనములు. 30.

వజ్ర—తొండముదిరి యూసరవెల్లి యయినట్లు ప్రాఁతరంటలు పరమపతివ్రత లగుదురు గాఁబోలు.

ఊర్వ—(కోపముతో) ఓరాక్షసరాజా! మేము వేశ్యలమైనను పతివ్రతలమే సుమా!

నర—పతియున్నప్పుడే గదా పతివ్రతయగుట పతియే లేనిదానిమాటయేమి?

ఊర్వ—దివస్పతియే నాపతి.

నర—ఈదివస్పతి కట్లు నీవిదివఱకెందఱకో పతివ్రతవైతివి. అట్లే నన్నుం బతిఁ జేసికొని నాకునుం బతివ్రత వగుము.

వజ్ర—ఊర్వశీ! నీవట్టిపతివ్రతవో యాయనయు నట్టియేకపత్నీవ్రతస్థుఁడు. నీ వాయనను జేపట్టితివేని మీకనుకూలదాంపత్య మగును.

నర—మఱియు భుజబలంబున వేల్పులం గెలిచి నేనిప్పుడు దివస్పతినైతిని. నీవు మాటనిలుకడ గలదానవై దివస్పతినైన నన్నుం జేపట్టుము. నీవు నాకుఁ బ్రసన్నురాల వగుదువేని సకలలోకకళ్యాణంబగు. కావేని నాకరాజ్యలక్ష్మిం గైకొన్నచందంబున నిన్నుం బలిమిఁ గైకొనవలసివచ్చు.

ఊర్వ—(తనలో) ఈదురాత్ముఁడు నామానభంగంబు చేయఁ గృతనిశ్చయుఁడై యున్నవాఁడు. మలినవస్త్రమును మాలిన్యముచేతనే శుద్ధిఁ జేయునట్లు దురాత్ములను కపటోపాయములచేత నిర్జించుట యుచితము!

వజ్ర—ఓవెఱ్ఱిదానా! ఊర్వశీ! ఈమహారాజు మిక్కిలి మంచివాఁడు. చెడఁ గొట్టుకొనక యాయనప్రాపకము సంపాదించుకొని సుఖపడుము.

ఊర్వ—దేవా! ఈవఱకు నాపలికినపరుషోక్తులకు నన్ను క్షమియింపవలయు. నేనెప్పటికైన మీదాననే.

నర—(సంతోషముతో) ఓభువనైకసుందరీ!

తే. గీ. నిన్ను క్షమియింప నేటికి నీపలుకులు
చాలఁ గఠినంబు లయ్యును జల్లనగుచుఁ
బరమసుఖ మిచ్చె వడగండ్లపగిది నొప్పి
మదనసంతప్తమైన నామదికి నబల. 31.

వజ్ర—వలపుగలవారు ప్రియురాండ్రు తాళ్ళ రువ్వినఁ బువ్వుల రువ్వినట్లు సంతసింతురు.

ఊర్వ—బావగారూ! నిజముగా నామీఁద మీకు మనసునఁ బ్రేమగలదా?

నర—రమణీ! నన్ను నీ విట్లు వేర యడుగవలయునా? నీకన్న నాకుఁ బ్రేమాస్పద మగుపదార్థ మేది?

ఊర్వ—నేను నమ్మఁజాలను. మగవారి కెదుట నున్నదే పెండ్లికూఁతురు. పురుషులు కామాయత్తచిత్తులై కన్యకలతోఁ జేసెఁ దమయక్కఱఁ దీర్చికొనుటకయి లేనిప్రేమముఁ జూపి యిచ్చకపుమాటలాడి బాసలుచేసి యంగనల వంచించి మరల మొగముఁ జూడరు. నిజముగ నాపై ననురాగము మీ కున్నయెడల నాకొఱకొకమాఱయిన నింతకాలమునుండి స్వర్గమున కేల రారయిరి?

నర—సుందరీ! నీవు పరవానియధీనమున నున్నపడఁతుకవు. మిందరికి మునకయి నావంటివాఁడు పరతునిపట్టణంబునకు వచ్చుట యనుచితముగదా!

తే. గీ. ఎంతకాలంబునుండియో యేను నిన్ను
గాంచఁ దలఁచిన సమయంబు గలుగదయ్యె
విబుధలోకంబుపై దండువిడియు కతన
వాలుగంటి నిన్గన నేఁడు వీలుగంటి. 32.

వజ్ర—ఇప్పటికి వీరి కిద్దఱకు నోఁపంబడికలు జరగినవి. ఇంక మేము ధన్యులమయితిమి.

ఊర్వ—బావగారూ! ఇది యొకవంకగాని నిజముగా మీకు నాపై ననుగ్రహమున్నయెడలఁ గాకిచే వర్తమాన మంపిన నేను రెక్కలు గట్టుకొని మీపాదములపై వ్రాలనా?

నర—సుందరీ! నా కంతటియూహము తోఁచినదికాదు. నన్ను మన్నింపుము.

వజ్ర—ఆయూహము తోఁచినయెడల మీయిరువురసందునఁ దిరుగలేక నేఁ జచ్చిపోదును. ఇంతకు నాపుణ్యము బాగున్నది.

ఊర్వ—ఓరసికశిఖామణీ! నీమనసున నిజముగ నాపై వలపు గలదో లేదో యని పరీక్షించుటకయి నే నెన్నియోవిధముల నిన్నుం దూలనాడితిని. ముజ్జగంబుల గెలిచి మహావైభవముతోఁ గన్నులపండువుగ రాజ్యమేలుచున్న మీవంటిరసికశేఖరుని విడిచి రాజ్యభ్రష్టుఁడై నిలువ నీడలేక కొండలఁ జరియించు మునిశాపోపహతుని పురుహేంద్రుని గొల్చియుండుటకు నే నంత తెలివిమాలినదాననా? ఎవ్వరుం దగినవారు లేకపోవుటచే

నున్నంతలో నరిపెట్టుకొనుట మంచిదని యింద్రునియందనుండి గౌరవముగఁ గాలము గడపుచుంటిని. ఇంక నేను నీధనము. నీవే నాప్రాణమవు.

నర — ధన్యోస్మి! ధన్యోస్మి! నే నిప్పుడు నిజముగా నింద్రుఁడ నైతిని.

చ. నిజమఁటె నీదుపల్కు నను నీబిగికౌఁగిటఁ జేర్చుదొక్కొ యం
గజపరితాపము ల్దొలఁగు కాలము వచ్చెనె నాకు నాదుది
గ్విజయము సార్థకం బగునె కీర్తి చెలంగునె యింక నీముఖాం
బుజమును ముద్దులాడుటకు పున్నెముఁ జేసితినే? తలోదరీ! 33.

వజ్ర — మేరే కాము. నేనును నాపితృదేవతలును పదునాల్గుతరములవఱకుఁ దరించితిమి.

నర — దేవీ! నందనోద్యానమునకుం బోయి విహరింతము రమ్ము.

ఊర్వ — దేవా! నాకొక్క ప్రతిన యున్నది. ఆప్రతిన చెల్లించి నన్నుం జేపట్టవలయు.

నర — నీప్రతినఁ బాలించుటకయి నీసేవకుఁడు సిద్ధముగ నున్నవాఁడు. ఆనతిమ్ము.

ఊర్వ — మీరు పాకశాసనుని గెల్చి మహేంద్రపదవి నాక్రమించుకొంటిరి. కాని బ్రాహ్మణులు మహర్షులు సేయుయజ్ఞంబులలో హవిర్భాగములు కొన్నప్పుడుకాని దేవేంద్రత్వము సార్థకము గాదు. అప్పుడు నే నిన్ను వరింతు. ఇప్పుడు బదరికావనమున సత్రయాగము జరగుచున్నయది. అక్కడకు మీ రరిగి ఋషుల నొప్పించి హవిర్భాగముల భుజించి రండు.

నర — (నవ్వుచు) ఇదియా నీప్రతిన! సరిసరి ఇది చెల్లించు టెంతసేపు. ఇంతకన్న మఱియేదియు లేదుగదా! అట్లు చేసినపిదప మఱియొకవంకఁ జెప్పవుగద.

ఊర్వ — మఱేవంకయుఁ జెప్పను. మాటఁ దప్పితినేని మిమ్మును జంపుకొన్నట్లే. ఇంక నాకు సెలవిండు. నేను బోయి మీరాకఁ నిరీక్షించుచుందును.

నర — దేవీ! అట్లే పొమ్ము. నేను నీదాసుఁడ ననుమాట మనసులో నుంచుకొనుము.

ఊర్వ — (తనలో) ఇప్పటికిఁ బులినోటికండవలె బైటఁబడితిని. ఈబుద్ధిహీనుఁ డీగండము గడచి బ్రతికినప్పటిమాటగద. మీఁద దైవమున్నాఁడు. (అని నిష్క్రమించును.)

వజ్ర — (తనలో) ఈగడుసుబానిసకూఁతు రేదో వంక చెప్పి యీమందభాగ్యుని కన్నులలో దుమ్ముకొట్టిపోయినది. ఇఁక వీనికి నీమె దక్కినప్పటిమాటకదా.

నర — వజ్రకంఠా! మురనిశుంభాదిసైన్యాధిపతులయొద్దకుఁ బోయి దానవసైన్యంబులు బదరికాశ్రమమునకుఁ బోవలయుఁ గాన ప్రయాణసన్నాహము సేయుమని చెప్పుము.

వజ్ర—చిత్తము (అని కొంచెము నడచి) దేవా! ఎందుకో మురుఁడిటనే వచ్చుచున్నాఁడు. వీనిమొగము సంతోషమును సూచించుచున్నది.

[అప్పుడు మురుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మురు—దేవా! విజయమగుఁగాక!

నర—మురుఁడా! మీస్వామిభక్తియు బాహుబలమును మాకు విజయకారణములయ్యెగా.

మురు—దేవా! నేనిప్పుడు కావించినమహాసాహసమును మీకు విన్నవింపవచ్చితిని.

వజ్ర—ఈమహాసాహస మేదో వినఁదగినదే.

నర—నీసాహసమును వినిపించి మావీనులకు విందు సేయుము.

మురు—దేవా! చిత్తగింపుము.

ఆ. వె. అమరమాత యైనయదితిదేవిని జేరి
యామెకుండలముల నపహరించి
తెచ్చినాఁడ నిపుడు దేవరవారికి
నర్పణంబు సేయ నధికభక్తి.

ఇదిగో రత్నకుండలములు (అని యిచ్చుచున్నాఁడు.)

నర—నీసాహసము సంస్తవనీయ మయినది. నీపేరు విన్న నిర్జరాంగనలకు గర్భనిర్భేదక మగుఁగాక! ఈకుండలము లూర్వశికి సమర్పించెదను.

వజ్ర—ఆఱునెలలు సాముచేసి మూలనున్నముసలిముండను గొట్టినట్లు ముదిమిచేఁ గదలలేక భయముచే నగము చచ్చి యొకమూల నొదిగియున్న వేల్పుటవ్వను గెలిచివచ్చితివా? నీవంటిధైర్యవంతుఁడు దేవరాక్షసులలో నెచ్చటను లేఁడు

మురు—ఓరివాచాటా! నీవు రాజుగారి విదూషకుఁడ వగుటచే నిప్పుడు బ్రతికిపోతివి.

నర—మురుఁడా! మనవజ్రకంఠునిమాటలు పాటింపనక్కఱ లేదు. యాగహవిర్భాగములు గ్రహింపకున్న నాకింద్రత్వము సిద్ధింపదు కావున సేనాసమేతులరై మీరిప్పుడు బదరికాశ్రమమునకుం బోయి యచ్చటితాపసుల నడిగి నయమున భయమున వారి నొప్పించి హవ్యంబులఁ గొనవలయు. సేనలకుఁ బ్రయాణముఁ జాటఁబంపుము.

మురు—(సందేహముతో) మహర్షులు మనకు హవిర్భాగముల నిచ్చుటకు సమ్మతింతురో లేదో.

వజ్ర—నేనపశకునపక్షివంటివాఁడ నని మీ రనుకొన్ననుసరేగాని సమ్మతింపని మాట నిజము.

నర—(కోపముతో) ఏమేమీ; చతుర్దశభువనైకవీరుఁడును తృణీకృతపురందరాదిదిక్పాలకుఁడును విజయలక్ష్మీకరుణాపాంగవిలోకనప్రవర్ధితమహావిభవుఁడును నగు నరకదానవేంద్రునిమాట వారు నిరాకరింతురా?

ఉ. దక్కునె యింక ప్రాణములు తాపసవర్యుల కెల్ల మానము
ల్దక్కునె నేలవేల్పులకు దైవతకోటికి యాగభాగముల్
గ్రక్కున నిచ్చి నన్నరయ కావర మొంది యొసంగ కుండినన్
ప్రక్కలు చేసెదన్ దలలు భస్మముఁ జేసెద నాశ్రమంబులన్. 35.

మఱియు నచ్చటిమునులు మనపలుకుఁ ద్రోసిపుచ్చిన వారితో నిట్లనుము.

మహాస్రగ్ధర. సవనంబుల్సాగ వింక న్జపములు తపముల్ స్నానముల్ సెల్ల వింకన్
భువనంబుల్నిల్వ వింక న్బావలు టరిది గోభూసురవ్రాత మింకన్
దివిజుల్ మర్త్యుల్ భుజంగుల్ స్థిరమతులయి వర్ధిల్లఁగాఁ జాల రింకన్
రవియు న్జంద్రుండుఁ జుక్కల్గ్రహములు గతివక్రత్వమున్ గాంతురింకన్.

వజ్ర—మా కింక చేతినిండ పనిగలిగినది.

ముర—చిత్తము. అప్పటికిని మహాత్ములు మీయాన తిరస్కరించిన మాయిచ్చ వచ్చినతెఱంగున మేము సేయవచ్చునా?

నర—ఆహా త్రికరణశుద్ధిగా.

తే. గీ. నెలఁగి యిచ్చ వచ్చినరీతిఁ జేయవచ్చు
నచటి కెవఁడు వచ్చునో చూతు నడ్డగింప
బవరమున మగంటిమిఁ జూపి పస యడంతు
నజ్జభవుఁడైన నాతనియబ్బ యైన. 37.

సైన్యంబులఁ దోడ్కొని మీరంతయుఁ బదరికాశ్రమమునకుఁ బొండు. నేను ప్రాగ్జ్యోతిషంబున కరిగి యచటనుండి కావలయునన్న బదరికావనంబునకు వచ్చువాఁడ. హయగ్రీవుండింద్రలోకమును నాకుఁ బ్రతినిధియయి యేలుగాక. మన మింకఁ బోవుదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



శ్రీ

# ప్రసన్నయాదవ నాటకము.

## తృతీయాంకము.

ప్రదేశము—ద్వారకానగరము.

[అప్పుడు మాణిభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాణి—(తనలో) అహహా! ఏమి యీనగరవైభవము. మహేంద్రుని యమరావతీపురమును ధనదుని యలకానగరమును నిరంతరమును గనుచున్న నాకన్నులకే యీనగర మింతసొగసుగ నుండఁ దక్కినవారిమాట చెప్పనేల? మహేంద్రుఁడు వాసుదేవునకు వావికి జ్యేష్ఠుఁడయినను వైభవమున నిశ్చయముగఁ గనిష్ఠుఁడే యని చెప్పవచ్చును.

మ. ఇది వైకుంఠము గాక కేవలపురంబే యెంచ నీనాగరుల్
త్రిదశుల్గాక మనుష్యమాత్రులె ధరిత్రీభారము న్బాపఁగా
నుదయం బందినచక్రి గాక నరుఁడే యూహింప నీకృష్ణుఁ డీ
యదువంశంబు పవిత్రమయ్యెఁ గద యీయబ్జాక్షుజన్మంబునన్. 1.

మఱియు నీపౌరులు చేసికొన్నపున్నె మెట్టిదోగదా!

మ. అరవిందాసనుఁడున్ మహేశ్వరుఁడు దివ్యాబ్దంబు లెన్నేని సు
స్థిరభక్తిన్ దప మాచరించియును వీక్షింపంగ లేరేని నా
సరసీజాక్షునిఁ గన్నులారఁ గని తత్సాన్నిధ్యము న్జెంది పి
ల్తురు సేవింతురు మాటలాడుదురు బంధుత్వంబు గావింత్రహో! 2.

ఇదిగో జగత్కల్యాణకరుఁ డగువాసుదేవుని ప్రాసాదరాజము. వారి యెందున్నవాఁడో యీవృద్ధకంచుకి నడిగి తెలిసికొనియెద. (ప్రకాశముగా) ఓయీ భద్రముఖుఁడా! యదుకుంజరుని సందర్శించుట కిది సమయమా? ఏమనుచున్నాఁడవు. "నీనామధేయ మెఱిఁగింతువేని నేఁబోయి నీరాక దేవకీనందనున కెఱిఁగించి మరల నరుదెంచెదనని నిన్నులోనికిం దోడ్కొనిపోయెద" నని యా? సరిసరి. ఇదిగో నన్నెఱిఁగించుకొనియెద

వినుము. నేను హరివర్మనలాలసుఁడనై వచ్చినమహేంద్రదూతను; కుబేర సేవకుఁడను; మాణిభద్రుఁడను. స్వామికి నారాక నెఱిఁగించి వేఁగమ రమ్ము. (తనలో) ఔరా! ప్రభువులగృహద్వారములు సేవకులయనుగ్రహము లేనిచో దుర్గమములుగదా! మహేంద్ర దూత నగు నాప్రవేశమే యింతకష్టసాధ్య మయినప్పుడు సామాన్యులయవస్థఁ జెప్ప వలయునా ?

ఆ. వె. పండ్లచెట్లమొదట ముండ్లకంపలు వోలె
గొప్పవారియిండ్లగుమ్మముకడ
ములుచబంట్లు నిలిచి మొఱవెట్టుకొనువారి
పరికిఁ జేరనీక తఱుముచుంద్రు. 3.

అదిగో వృద్ధకంచుకి యిటనే వచ్చుచున్నాఁడు. వాసుదేవుఁడు నారాక విని నాప్రవే శంబు నడపుమనియేఁ గావలయు.

[అప్పుడు దేవలుఁ డనువృద్ధకంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

దేవ—(తనలో) చిన్ననాఁట నుండినలక్షణములు పెక్కులు వార్ధకమున నా యందుఁ గానఁబడుచున్నవి. ఎట్లనిన—

తే. గీ. పాటవము గనంబడదు మొదలఁ; బండ్లు లేవు
నోట చొంగలు గారెడు నుడి తడబడు
మదికి నిల్కడ లే దిట్టి మంకుతనము
ముదిమి రెండవబాల్యమ న్పదము నిజము. 4.

ఇట్లు వయోభారముచేత నేను గ్రుంగుటంజేసి నందనందనుఁడు నాయందుఁ బరమ దయాళువై యన్యవస్థితము నకు బాలకులకు నానందంబు నందుచు శ్రమకరములు గాని పనుల నియోగింపమిఁ బ్రద్యుమ్నాదికుమారులవలె నన్నాదరించుచున్నవాఁడు.

మాణి—అయ్యా! వాసుదేవునకు నాయాగమనం బెఱిఁగించితివా?

దేవ—(ఆమాట వినకయే తనలో) కాని యీవాసుదేవుని చేష్టలలోఁ గొన్ని నాకు బోత్తిగఁ గిట్టవు. యీయనంతలి సమస్తవ్యాపారములయందుఁ దాను బ్రవేశించి యంతటిభారముఁ దనపై వేసికొని నిద్రాహారములులేక నిరంతరముఁ గష్టపడుచున్నాఁడు. ఇది నాకసమ్మతము. ఇదిగాక దేవతలమని దయ్యములమని జోగులమని రోగులమని కష్ట సుఖము లెఱుఁగని మోటవాండ్రు కొందఱు తమసొమ్మంతయు నిచ్చట దాఁచఁబెట్టినట్లు వచ్చి యర్ధరాత్రి యనక యపవేళ యనక బంధువులతోఁ గూర్చున్ననుసరే పండుకొన్నను సరే యాప్తబంధువులవలె వచ్చి పిలుచుకొనిపోవుచుందురు. దానికేమి వాం డ్రెంత మొండివాండ్రో వాండ్ర కెంతసిగ్గులేదో భార్యలతో ముచ్చటించుచున్నవాఁడని చెప్పి

నను వదిలిపెట్టరు. ఆకస్మికముగ నిందఱు కొడుకులు వచ్చినట్టుగానే యితఁడును వారినిఁ బిలుచుకొనిరా పిలుచుకొనిరా యనినన్నుఁ దఱుముచుండును. కాని కాలము వచ్చియున్నది గనుక తా నెంత బలవంతుఁ డయినను నేవేళకు నెటువచ్చునో, యన్నప్పుడు చెప్పినట్టు రాదుగదా యని యీజోలికిం బోవలదని చిలుకకుఁ జెప్పినట్లు పలుమాఱులు చెప్పితిని. అయినను నామాట వినువా రెవ్వరు? వారు పిలుచుటకు నీయన పోవుటకు సరిపోయినది. ఇదిగో నప్పుడే శనిలాగున వీఁ డెవఁడో వచ్చి కూర్చున్నవాఁడు. వీనిం బిలుచుకొని రమ్మని యాయన సెల వయినది.

మాణి—(బిగ్గరగా) అయ్యా! నీవే రెవ్వరో నే నెఱుంగ. నామాట కుత్తర మొసఁగవేమి? భగవంతుఁడు నాయెడఁ బ్రసన్నుఁ డయ్యెనా?

దేవ—(కోపముతో) నా పేరు దేవలుఁడు. నాకుఁ జెవుడులేదు. నీవంత గొంతుఁ జించుకొన నక్కఱలేదు.

మాణి—అయ్యా! కోపించెద వేల? నీయెడ నే నపరాధినైన క్షమింపుము.

దేవ—అపరాధ మేదియు లేదు. అధికప్రసంగ మేల? వాసుదేవుఁడు సత్యభామా సమేతుఁడయి నీరాక కెదురుచూచుచున్నవాఁడు. నావెంటరమ్ము.

మాణి—అహహా! ఇది మంచిసమయమే; పోదము.

తే. గీ. సతులఁ గలిసియున్నప్పుడె సత్పురుషులె
మదిఁ బ్రసన్నులై వరదు లయ్యెదరు సూవె
మెఱుపుతోఁ గూడుకొనియున్న మేఘమాల
కురియకుండునె చల్లఁగఁ గుంభవృష్టి. 50.

దేవ—మీకు సమయముగాని దెప్పుడు. పోదము పద.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

[అంతట శ్రీకృష్ణుఁడు సత్యభామయుఁ బీఠములపైఁ గూర్చున్నవారై ప్రవేశించుచున్నారు.]

కృష్ణ—దేవీ! మహేంద్రుఁడు మాణిభద్రుని నాకడ కనుపుటకుఁ గారణ మేమై యుండు.

తే. గీ. అమరలోకంబుమీఁద నేయసురలైన
నేఁడు దండెత్తి యుందురా నీతి విడిచి

పరుఁ డెవండైన దేవేంద్రపదముఁ బడయఁ
దపము సేయుచు నుండునా తగవుమాలి. 6.

సత్య—దేవా! అమరరక్షణముఁ జేయుటకుఁ గంకణముఁ గట్టుకొని మీ రుండ నేదైనను మహేంద్రునకు భయములేదు. అదిగో దేవలుఁడు మాణిభద్రుని వెంటఁబెట్టుకొని వచ్చుచున్నాఁడు. కారణ మిప్పుడే తెలిసికొనఁగలము.

[అప్పుడు దేవలుఁడు మాణిభద్రుఁడు ప్రవేశించుచున్నారు.]

దేవ—అయ్యా! మాణిభద్రా! అదిగో భగవంతుఁడు. ఇంక నీగోడవలు చెప్ప మొదలుపెట్టుము.

మాణి—మంచిది (తనలో) ఇంద్రనీలమణి రోచులు వెదఁజల్లు నీతనిమూర్తి యింద్ర సౌదర్యమును వెల్లడించుచున్నదిగదా!

మ. పగచే దైత్యులు గాట నావలపుచేఁ బాథోజపత్రేక్షణల్
వగచే నార్తులు జ్ఞానవైభవముచే బ్రహ్మర్షు లేతేజముక్
దగ సేవించి ముముక్షు లయ్యెదరొ బంధంబు ల్వీడంబాయ నా
భగవంతుం డగుదేవకీసుతుని నాభాగ్యంబునం గాంచితిక్.

దేవ—దేవా! ఇతఁడే దేవదూత. నేనిఁక పోయి ద్వారముకడ నుండెద. (అని పోవును.)

మాణి—త్రివిక్రమున కభివాదనము సేయుచున్నాఁడను.

కృష్ణు—మహేంద్రదూతకు స్వాగతము.

సత్య—దివ్యపురుషదర్శనముచేఁ గృతార్థుల మైతిమి.

కృష్ణు—మాణిభద్రా! నిర్జరకోటికి భద్రమా?

మాణి—ఉపేంద్రా!

తే. గీ. తెలిసి యడిగెద వనజాలఁ దెలిసియున్న
మరల నానోట వినఁగోర వెలుఁగనట్లు
తెలియ కడిగెద వనజాలఁ దెలియకున్న
సర్వ మెఱిఁగిన నీ కిట్టిస్వల్పవార్త. 8.

కృష్ణు—(ఆశ్చర్యముతో)ఏమిది యి ట్లనుచున్నాఁడవు. సపరివారముగ దేవేంద్రునకుఁ గుశలమా?

సత్య—నిర్జరాంగనలతోఁ గలిసి యింద్రాణి కుశలముగ నున్నదా?

మాణి—విన్నవించుచున్నాఁడను.

చ. కుశలముఁ జెప్పెదన్ వినుము గోపకుమారక కానసంబులన్
గుశలము పాకశాసనునకున్ గనకాచలగహ్వరంబులం
గుశలము వానినందనునకుం శచికిం జెఱసాలమూలలన్
గుశలము తచ్చమూపతులకుం జెరవారలమాట లేటికిన్. 9.

కృష్ణ—ఏమీ! దుష్టదానవుఁ డెవ్వఁడైన వేల్పువీటిపై దండువిడిసి యమరరాజకుటుంబమును నగరమునుండి వెడలనడఁచెనా ?

సత్య—అట్లే జరగెనని తోఁచుచున్నది.

మాణి—దేవా! అవధరింపుము. ప్రాగ్జోతిషాధీశ్వరుఁ డగునరకాసురుఁడు నిష్ఠాగరిష్ఠుఁ డయి చిరకాలము తపముఁ జేసి పరమేష్ఠిం బ్రసన్నుఁ జేసికొని తదనుగ్రహంబున వరంబు లనేకంబులం బడసి జగత్కంటకుఁ డయి యథేచ్ఛఁబుగ విహరించుచుఁ బ్రజలకుఁ గీడు నాపాదించుచున్నవాఁడు.

కృష్ణ—ఆదానవునిదౌష్ట్యమునుగూర్చి యిదివఱకే కొంత వినియున్నాఁడను.

సత్య—అనేకరాజకన్యల బలిమిం బట్టితెచ్చి చెఱఁబెట్టిన నీచదానవుఁ డతఁడే కదా?

మాణి—అమ్మా! ఆయధముఁ డతఁడే. ఆకథఁ గొనముట్ట వినుఁడు. ఆదనుజకంఠీరవుఁడు మిడుతలదండుంబోలె మితిమీఱిన దనుజబలంబుం గూర్చుకొని యీనడుమ నమరావతి ముట్టడించి వేల్పుదళంబుల నోడిచి పాఱఁదోలె. అప్పుడు వేల్పుదొరల యవస్థల నేమని వర్ణింతు. వాయుదేవుండు కన్నుల కగపడక యేమూలనో యొదిగి యుండె. వరుణదేవుఁ డాపత్సముద్రనిమగ్నుఁడై యున్నవాఁడు. వైశ్వానరుఁడు దుఃఖానలసంతప్తమనస్కుఁ డయ్యె. ఈశానుండు సర్వస్వము గోలుపోయి నిర్భాగ్యుఁ డయి యిల్లు వల్లకాడుగఁ జరించుచున్నాఁడు.

కృష్ణ—సరే! ఇంక బృందారకేంద్రుఁడు రాజ్యభ్రష్టుఁడై విదేశంబులనున్నవాఁడని నీవు చెప్పనక్కఱలేకయే తెలిసికొనవచ్చును.

సత్య—అయ్యో! మహేంద్రుఁడుం బౌలోమియు నిప్పు డెందున్నవారు?

మాణి—(దుఃఖముతో) దేవా! దేవీ! మహేంద్రుని యవస్థఁ జిత్తగింతురుగాక!

సీ. ఆడుగువారలకోర్కె లప్పుడ సమకూర్చుపసర మెవ్వనియింటిపాఁడిమొదవు
అరకాల ముజ్జగం బాక్రమించిన యట్టిధవళాశ్వుఁ డెవ్వానితమ్ముగుఱ్ఱ
కల్పభూరుహపంచకము మొల్చునందనం బెవ్వాఁడు విహరించుపువ్వుఁదోఁట
యఖిలయాగఫలంబు లవలీల నొడఁగూర్చుపడఁతు లెవ్వనివీటి పణ్యసతులు

మొనసి జేజేలు ముప్పదిమూడుకోట్లు
మకుటమాణిక్యరుచుల నేమఘువుపాద
పద్మముల నివాళింతు రాబలహారుండు
నేఁడు చరియించు నిలువంగ నీడలేక. 10.

మఱియు నోయాదవేంద్ర!

చ. అలసిరితోడికోడలు జయంతకుమారునికన్నతల్లి వే
ల్పులదొర రాణివాసము పులోమునికాదిలిపట్టి వేల్పుక
న్నెలు భజియింప కల్పధరణీరుహసంతతి మేలినీడలన్
మెలఁగెడుచాన మీవదినె నేఁడు జరించు నరణ్యభూములన్. 11.

కృష్ణు—కటకటా! ఎంతకష్ట మెంతకష్టము. విధిపరిపాక మవిలంఘనీయము గదా! అనంతర మారాక్షసహతకు లేమి చేసిరి?

మాణి—తే.గీ. అది యొనర్చిరి దానవు లిది యొనర్చి
రనుచు వర్ణింప నేటికో యంబుజాక్ష
చెప్పఁ దగుకార్య మొకటి చేసినది లేదు
నింద్యమగుకర్మ మొకటి మానినది లేదు. 12.

సత్య—పురుషుల యవస్థలే యటులుండ స్త్రీలగతు లెట్లుండెనని నేనడుగనేల?

మాణి—అమ్మా! సాత్రాజితీ! నాపలుకులు వినుచుండియు వేల్పుటువిదలయునికి నీవెఱుఁగఁగలవు.

తే. గీ. అసురకాంతలసౌభాగ్య మపహరించు
కమలనాభునిఁ గడుపారఁ గన్నతల్లి
యదితిదేవి కైనను దప్పవయ్యె పాట్లు
చెప్ప నేటికిఁ దక్కినస్త్రీలమాట.

కృష్ణు—భువనైకపూజ్యయగు నమరమాత కేమి చేసిరి?

సత్య—దానవక్రూరకార్యము వేల్పుటవ్వకైన విడువలేదా?

మాణి—నరకుని వాహినీపతులలో నొకఁడగుమురుఁడు నిర్జరమాతకుండలముల హరించి తనయేలిక కర్పించెను.

కృష్ణు—(కోపముతో) దురాత్మా! నరకహతకా! పరాక్రమలవదుర్విదగ్ధ! అతిక్రాంతసమస్తరణధర్ముఁడ వగునీ నాశనము సమీపించినది సుమా! ఓమణిభద్రా!

తే. గీ. మితి యెఱుంగక యీరీతి మిట్టిపడెడు
చెనటిదానవుఁ డిఁక మీఁదఁ జెడక పోఁడు

పొడ వెనంగుతరంగంబు లడఁగకున్నె
పోటుగన్న సముద్రంబు పాటుఁ గనదె ?

మాణి—దేవా! ఇదిమాకు వరప్రదానమే! అనంతర మాదనుజహతకులు నందనోద్యానము నాశనము గావించి మందాకినీనది మలినంబుచేసి యమరావతి సమరశూన్యంబొనరించి చేఁజిక్కిన యచ్చరలతో నిచ్చవచ్చినట్టుల దచ్చనలనేటిపి చేయవలచిన వన్నియుఁ జేసిరి. వేయేల!

తే. గీ. గడ్డిపోఁచయుఁ జేయని కడయసురయు
దిక్పతులవంటివారినిఁ దిట్టఁ జొచ్చె
దంటు విడియగె తొల్లింటి దైత్యనాథు
లింతపాప మేనాఁట నే నెఱుఁగఁ గాక 15.

మఱియు

ఉ. ఆతనిదండనాథుఁ డఁట యాతనికన్నను జండశాసనుం
డేతరి యైన నేఁ డెనయ మించుక; నిల్వగనీయఁ డొండొరున్
బ్రాఁతిగఁ జూడనీయఁ డొకపట్టునకుం జననీయఁ డయ్యొ యా
చేతలు సుంచితీరవలెఁ జెప్పఁగ శక్యముగాదు మాధవా! 16.

సత్య—యజమానుఁ డెంత నీచుఁడో యనుజీవులు నంత నీచులే యగుదురు.

కృష్ణ—దనుజసేనాపతి యగునాశూరంమన్యుఁ డెవరు ?

మాణి—ఆతని పేరు హయగ్రీవుఁడు.

సత్య—ప్రాణేశ్వరా! ఈతఁడు మీనామమును ధరించియున్నవాఁడే.

మాణి—ఖద్యోతశబ్దము మిణుఁగుఱుపురువునందును హరిశబ్దము కప్పయందును శివాశబ్దము నక్కయందును వర్తించునట్లు హయగ్రీవశబ్ద మాదురాత్మునియందు వర్తించుచున్నది.

కృష్ణ—మాణిభద్రా! కాల మాసన్న మయినవారియందుఁ గనఁబడులక్షణము లన్నియు నరకాసురునియందుఁ బొడఁగట్టుచున్నవి.

మాణి—దేవా! మహేంద్రుఁ డిప్పుడు నరకునివంటి యధమునిచేత నిట్లయితినని లజ్జావనతవదనుఁ డయి యున్నవాఁడు.

కృష్ణ—ఇందు సిగ్గుపడవలసిన దేమున్నది. చూడు,

తే. గీ. కాలగతిఁ దప్పి వచ్చినఘనుఁ డయినను
నిగ్రహింపంగఁబడుఁ జుమీ నీచుచేత

జగము లన్నియు వెలిఁగించు చండకరుఁడు
చిన్నిమబ్బులచేత సంఛన్నుఁ డగును. 17

మాణి—అంత మహాతేజశ్శాలి కింత పరాజయము జరగఁ దగినదికాదు.

కృష్ణ—ఓయీ! తేజశ్శాలులకేగదా జయాపజయములు కలుగుట. చూడు.

తే. గీ. న్యూనతయు గౌరవంబు మహోన్నతులకె
గాక నీచుల కెబ్బంగిఁ గలుగవచ్చు
నలఘుతేజులౌ సూర్యచంద్రులకె గాక
గ్రహణ ముండునె మింటిచుక్కలకు నెల్ల? 18.

మాణి—దేవా! మీసమాశ్వాసనంబున నాహృదయతాపముఁ దీఱినది. మహేంద్రుఁడు మీకు విన్నవింపు మన్నసందేశము వినుఁడు.

కృష్ణ—సావధానుఁడ నయి యున్నాఁడను.

సత్య—ఆపత్సమయమునఁ బంపిన యీసందేశము జాలిగ నుండకపోదు.

మాణి—దేవా! నా చెప్పఁబోవునవి మహేంద్రవాక్యములు.

సీ. కాళీయపణిఫణాగ్రములఁ దాండవమాడు నడుగుఁదమ్ములకు జోహారు లనుము
అదితికశ్యపులకు నవతరించిననాఁడు మా కొనర్చిన మేలు మఱవ మనుము
అమరసంతతి యిట్లు లెగచాట్లుపడుచుండ నోరునికై వడిఁజూచు టొప్పదనుము
ఈ తెఱంగునఁజేయ లాఁతివారమె మేము చాలకాలము నాఁటిసఖులమనుము
ఆలుఁబిడ్డలదెసఁ జూచి యమరవిభుఁడు
వేయుఁగన్నులబాష్పము ల్విడిచె ననుము
అసురఁగడతేర్చుపని తన కలఁతి యనుము
దైవహిత మాట నీయది తప్పఁదనుము. 19.

సత్య—ఈసందేశము విన్నపిదప రాతిగుండెలయిన కరఁగి జాలినొందును.

కృష్ణ—అన్నన్నా! ఎంతమాట. నిరుపమానమహిమాఢ్యుఁడును నిర్జరలోకసార్వభౌముఁడును శూరశిఖామణియు నగుశతక్రతుఁ డిట్లు దీనోక్తులం బలుకవలసెనే! తనసేవకునకు వా కింత వినయపూర్వకముగ మనవి నంపవలయునే! మాణిభద్రా! నీవరిగి మహేంద్రునితో ని ట్లని విన్నవింపుము.

సీ. ఋజుమార్గచరు లౌట బృందారకుల కెందు దేవకీసుతుఁడు విధేయుఁ డనుము
పదునాల్గుజగముల పాలుపత్తెముఁబూను నింద్రుఁడానతి మాకి నిడుదు ననుము
తనయనుగ్రహమున్న దనుజవీరులనాజి నిగ్రహించుట యొక్క నిముసమనుము
నిర్నిమిత్తంబుగ నిరపరాధుల నేఁచు పాపకర్తు లింక బ్రతుక రనుము

దివిజవైరి నిశ్చయముగఁ దెగియె ననుము
ధర్మమే జయించెడుమాట తథ్య మనుము
మదిని వగదక్క మనుము నామాట వినుము
వేల్పువీటికి నీవు వేవేగఁ జనుము. 20.

మాణి—దేవా! ధన్యోస్మి! ధన్యోస్మి! వేల్పులయిడుములు కడముట్టినవి. ఇంక నే నరిగెద. (అని నిష్క్రమించును.)

సత్య—ప్రాణేశ్వరా! మీరా పద్బాంధవులన్నమాట నేఁడు స్పష్టమైనది. తొల్లి గజేంద్రరక్షణము పరోక్షమునం జరిగినది. మహేంద్రరక్షణము నేఁడు ప్రత్యక్షముగ జరుగుచున్నది. మునులపాలింటికి దేవతలపాలింటికి మీమూర్తి భూలోకమందారము గదా!

[తెరలో]

దేవకీనందనా! రక్షింపుము. రక్షింపుము.

కృష్ణ—ఏమిది. ఆర్తనాదము వినఁబడుచున్నది. ఓరీ! ఎవఁడురా యక్కడ?

దేవలుడు—(ప్రవేశించి) ఇదిగో వచ్చినాఁడ నాజ్ఞాపింపుము.

కృష్ణ—దేవలా! ఎవరో రక్షింపుమని కుయ్యిడుచున్నారు. కనుఁగొని రమ్ము.

సత్య—దేవలా! అతిత్వరితమున రమ్ము. నామనసు తత్తరపడుచున్నది.

దేవ—చిత్తముదేవా! (అనినిష్క్రమించి మరలఁ బ్రవేశించి తనలో) అబ్బబ్బా! నడపీనుఁగులవంటి యీముని ముచ్చులకు సిగ్గు లేదుగదా! జనుపనారపేఁచుల వంటి గడ్డములు, నీఁతతుప్పలవంటి తలలు బిరుసుమేనులుగల యీపాడు మునులు పని పాటలులేక దుంపలు కాయలు కూరలు తిని తెఱపి దూడలవలెఁ దెగబలిసి యెవరితోనో గయ్యమునకుఁ గాలుదువ్వి వైరముఁ దెచ్చుకొని యంతటకు లోకువగ మాయమర్మము తెఱుఁగని వెఱ్ఱిగొల్లఁ డిక్కడ నున్నాఁడుగదా యని వచ్చి యిచ్చకాలు మచ్చికలు చెప్పి కల్లబొల్లి యేడ్పు లేడ్చి మనసు విఱిచి యీయయ్యను దీసికొనిపోవుదురు. పోవద్దని నే నెంత మొత్తుకొన్న నామాట వినఁడు. పోనీ. నాకేమి. (అనిప్రకాశముగా) మహాప్రభూ! ఎవరున్నారు. మనచుట్టాలు బదరికాశ్రమ తాపసులు. మీదర్శనము కావలయునఁట.

కృష్ణ—అట్లయిన సత్వరము వారిం బ్రవేశపెట్టుము.

దేవ—చిత్తము (అనిపోవుచున్నాఁడు.)

సత్య—మహర్షు లూరక రారు. మహత్కారణ మేదో యుండవలయును.

కృష్ణ—లోకసంబంధములేని యీతపోధనులిటకు రాఁగారణ మేమిచెపుమా? వీరి కేదుర్జనులవలన నేని భయము కలిగియుండదుగద.

మ. మనుచుం గానలఁ జెట్లనీడలను జర్మంబుల్ మెయిం దాల్చుచుం
దినుచుం దుంపలు కాయగూరలు నదీనీరంబులం ద్రావుచున్
మనముం దెప్పుడు నీశ్వరుం దలఁచుచు న్మౌనంబుతో శాంతతన్
దినము ల్వుచ్చెదు నీయలౌకికుల నేనీచుండు బాధించెనో? 21.

సత్య—ఈమహాత్ములును రాక్షస బాధితులే యని నేఁ దలంచెద.

[అప్పుడు పులహబృహదశ్వు లనుమహర్షులతో దేవలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దేవ—మునులారా! అదిగో వాసుదేవుఁడు. పనులన్ని మానుకొని మీనిమిత్తమెదురు చూచుచున్నాఁడు. దర్శనము చేసికొనుఁడు.

పుల—(కృష్ణునిఁజూచి) బృహదశ్వా! ప్రావృట్పయోదముఁదలఁపించు నీ మూర్తిం గనుఁగొంటివా?

బృహ—పులహా! మాఁగిన రేఁగుఁబండ్లు తినమరగి బదరికావనమును బాసి పోవ లేక తొల్లి మనలం గలసిమెలసి చరించిన నాఁటి నారాయణుని దివ్యమూర్తియే యిది.

పుల—ఔనౌను.

సీ. పడతిఁ బాయగలేక పాలసంద్రమునందు నిల్లరికముఁగొన్న యల్లుఁడితఁడు
బృహ—మొసలికోఱలఁ జిక్కి పసమాలి పలవించు సింధురేంద్రునిప్రాణబంధు వితఁడు
పుల—ఏడువార్ధులనీళు లేకంబ యగునాఁడు మఱ్ఱియాకున నున్నకుఱ్ఱఁడితఁడు
బృహ—భువనకంటకులైనపాలసుదిండులఁ బట్టి మట్టుపెట్టినఁజగజెట్టి యితఁడు
పుల—మీనమీతఁడుతామేటిమేటి యితఁడు
పోత్రి యీతఁడు నరసింహమూర్తి యితఁడు
బృహ—పుట్టుబుద్ధులు గలపొట్టిప్రోడ యితఁడు
చూడఁజూడ దీనులపాలి చుట్టమితఁడు. 22.

దేవ—(కృష్ణునితో) దేవా! వీరే పులహబృహదశ్వులను మహామునులు. నేనింక ద్వారముకడ నుండెద. (అని పోవును)

ఋషులు—విజయతాం విజయతాం దానవకురంగకంఠీరవః

కృష్ణ—మహర్షుల కభివాదము సేయుచున్నాఁడను.

ఋషు—అనయోర్దంపత్యోరభ్యుదయోఽస్తు.

కృష్ణ—మీరాపీఠములమీఁద నాసీనులుగండు. (ఋషులు కూర్చుండురు)

సత్య—(మెల్లగా) ప్రాణేశ్వరా! మహర్షులు ఖిన్నులై కనఁబడుచున్నారు. క్షేమమడుగఁదగును.

కృష్ణు—దేవీ! నాకు నట్లే కనఁబడుచున్నారు. (ఋషులతో) మహాత్ములారా! ఫలాపేక్ష పరిత్యజించి పరమేశ్వరప్రీత్యర్థము జగదభ్యుదయము నిమిత్తము మీరు గావించు తపస్సులు నిర్విఘ్నములుగ సాగుచున్నవా?

పుల—ఈవఱకు సాగుచున్నవి.

ఉ. ఎన్నఁటిమాటలో యడిగె దీ విటు మాబదరీవనంబులో
నిన్నడుమం బ్రవర్తిలిన వెల్ల నెఱుంగవు గాక; ధర్మముల్
జన్నములుం దపస్సులును జన్నవి మొన్నటితోనె యింతగా
నున్నది నీజగద్భరణ మోనలినేక్షణ యిన్నినాళ్లకున్. 23.

బృహ—ఇంక జగదభ్యుదయమునకు లోప ముండదు. ఏమనిన

తే. గీ. ఇంద్రుఁ డైనవాఁ డిపుడు దైత్యేంద్రుఁ డొకఁడు
వాని వాహినీపతులు దిక్పతులు గాఁగఁ
బ్రబలదుష్టకర్మములు ధర్మములు గాఁగఁ
బిశితభోజనుల్ మునులుగా వృష్ణితిలక. 24.

కృష్ణు—అయ్యా! మీరును నరకబాధితులైతిరా యేమి?

పుల—దేవా! నీవు లెస్సగ గ్రహించితివి. మేము బ్రతికియుండియు భూలోకమున నరకబాధ ననుభవించుచున్నాము.

బృహ—ఇది పుణ్యాత్ములే యనుభవించు యపూర్వనరకబాధసుమా!

సత్య—ప్రాణేశ్వరా! ఏకోలికిరాని పరమవైదికులపైనయిన నాదుర్జనులకు జాలి గలుగదయ్యెఁ గాఁబోలు.

కృష్ణు—కళ్యాణీ! క్రూరు లుచితానుచితముల నెఱుఁగరు కదా!

తే. గీ. కాననంబున రేఁగిన కారుచిచ్చు
వేములను గాల్చి మామిళ్ళ విడిచి చనునె
మృగయునకుఁ బెద్దపులి యెంతో మెకమునంతె
దుష్టులకు సాధువులు నసాధువులు నొకటె. 25.

ఓమహాత్ములారా! నరకుఁడు మీపై కేల రావలసివచ్చె?

పుల—దేవా! తత్కారణమును మే మానుపూర్విగ నెఱుఁగముగాని కర్ణాకర్ణిని వినియున్నారము. మాదురదృష్టము మూర్తిగైకొన్నదో యన్నట్లు త్రిదివమున సూర్వశి యను నొకభోగముది కలదఁట.

కృష్ణు—అవును. పూర్వ మచ్చరలపైఁ గోపముచే నారాయణఋషి యామెను సృజించెను.

సత్య—ఏమి! ఋషియే సృజించెనా? పద్మగర్భుఁడు కాఁడా?

పుల—అమ్మా! ఇట్టియవివేక కార్యములు మహర్షులుగాక యెవరు చేయుదురు.

బృహ—ఒక్కమహర్షులే కాదు. బ్రహ్మయు నట్టివాఁడ

తే. గీ. ఊరకయె పెక్కుకల్పంబు లుండియుండి
వెఱ్ఱిబ్రహ్మ తా నొకదైత్యవిభు సృజించు
వానిఁ దెగటార్ప భువనముల్ పల్లటిల్లు
మొదటినుండియు నిదె పచ్చు మొదటివేల్పు. 26.

పుల—దేవా! అవధరింపుము. ఆదుగాత్ముఁడు స్వర్గము జయించి యింద్రుం బాఱఁ ద్రోలి యూర్వశిని దన కంపుడుకత్తెగ నంపుమని ప్రార్థించెనఁట. అదియు మునుల యాగముల హవిర్భాగములు గ్రహించి యింద్రత్వసిద్ధిఁ జేకొన్నపిదప వానిని వరింతు నని పలికెనఁట. అది విని దుష్టదానవులు మాయాశ్రమములకు వచ్చి దానవేంద్రునకు హవిర్భాగములు తే తెమ్మని నిరోధించి యడిగిరి.

బృహ—సాంగ్రామిక శాస్త్రవేత్తలై యాయుధపాణు లయినవీరులే వానియెదుట నిలువలేకపోవ నాయుధములులేక దండకమండలు కృష్ణాజినదర్భాసనాదు లగునిరర్థక సాధనములు గల మావంటిపరమవైదికు లేమి చేయుదురు?

కృష్ణ—అప్పుడేమైనది? మీరు హవిర్భాగముల నిచ్చుటకు సమ్మతించితిరా?

పుల—పాపము శమించుఁగాక! పాపము శమించుఁగాక! మాధవా! మే మెంత పరమఛాందసులమయినను మహాపాతకు లగుదానవాధములకు హవిర్భాగము లిత్తుమా? అది స్వప్నవార్త. వారితో నప్పుడే నిట్లంటి.

క. నెత్తురు ద్రావిన ద్రావుఁడు
కుత్తుక కోసినను బట్టి కోయుఁడు మీకే
మిత్తు మెంకో హవిర్భాగము
తొత్తుకొడుకులార వేల్పుదొరకెడ కుండక. 27.

సత్య—మునులధైర్యము మెచ్చఁదగినది.

కృష్ణ—అప్పుడు వారలు మిమ్మేమి చేసిరో మేమూహించుకొనవచ్చును.

బృహ—మాదీనచరిత్రము మానోటనే వినుఁడు.

సీ. మొగము నెత్తురుగ్రమ్మ నెగగుంజి దిగగుంజి బిరుసుగడ్డము లూడఁ బెఱికినారు
వ్రేలు పెన్నెఱిజడల్ కేలుదోయినిఁ బూని హుమ్మని యుయ్యాల లూఁగినారు

ఆజ్యమంతయుఁ ద్రావి యగ్నిహోత్రము లార్పి హోమకుండంబుల నమిసినారు
పాఱిపోవఁగనీక నోరు బ్రద్దలు చేసి కుక్కమాంసము నోటఁ గుక్కినారు
చెట్టులకు రెక్కలు విఱిచికట్టినారు
చింతబరికెలతో వెన్నుఁ జెండినారు
నారగోచులు దిగలాగి నవ్వినారు
కూళ లగుచు రక్కసిమూండకొడుకు లనఘ! 28.

కృష్ణ—కటకటా! అప్పుడు దేవబ్రహ్మర్షులకు మహత్తర మైనచిత్తక్షోభము గలిగియుండును.

సత్య—ఆహాహా! ఋషు లెంతదయామయులో చూడుఁడు. అప్పటికయినను దుష్టదానవులను శపింపరైరి.

పుల—అమ్మా శపింపకపోవుటకు మాదయ కారణము గాదు.

క. శాపం బిచ్చుట కైనను
శాపోదకములు గ్రహించి చల్లుట కైనన్
గోపించుట కైనను మా
కోపిక లేదయ్యె చేష్ట లుడిగినకతనన్. 29.

కృష్ణ—అనంతర మేమి జరిగినది?

బృహ—అప్పు డప్పాపసుదింకులు కొండముచ్చులవలెచ్చునం జెచ్చునెఱిగి యాశ్రమమహీరుహంబుల నిర్మూలించియుఁ బెంపుడుమృగములఁ జంపియు ఋషికన్యలఁ జెఱఁబెట్టియు కమండలంబులఁ దుత్తునియలు గావించియు నాషాఢదండంబులు విఱిచియు మొలత్రాడుల జన్నిదంబులఁ ద్రెంచియుఁ బర్ణశాలల భస్మపటలంబు గావించియు వర్ణింపరాని క్రౌర్యంబుల నెఱపిరి.

పుల—తే. గీ. నాకమండలు వట్లు భిన్నంబు లగునె
యాదురాత్ములతల లెన్నఁడైన కృష్ణ

బృహ— యాశ్రమ మహీరుహములట్లు లాహతకులు
దుంప తెగి యెన్నఁడైన బోదురె మకుంద? 30.

కృష్ణ—స్వామినమకులవంటి మీపలుకు లసత్యములు గావు. వా రట్లే నశింతురు.

సత్య—వీరుపడినయులజడి వీరిమాటలం దెలియవచ్చు.

పుల—ఓయమరపక్షపాతి! వాని నాశనము నీవే చేయవలెను. ఏలయన

తే. గీ. శూలివలనఁ గా దిది తమ్మిచూలివలనఁ
గాదు మఱి యెవ్వరివలనఁ గాదు సుమ్ము

నరకు మూర్ధంబు ధరఁ ద్రెళ్ళ నఱకఁబడును
సరగ నీచేత నీసుదర్శనముచేత. 31.

బృహ—దేవా! ఈవిషయమున నిన్నుం బురికొల్పుటకు మేము కడుశంకించుచున్నాము. ఏమన

క. నీకొడుకంట యాదవుఁడు
నీకొడుకే యిట్లు సేయ నిలుచునె జగముల్

పుల—నీ కెందు కూరకుండుము
యాకీర్త్యపకీర్తు లింక నతనివె కావా? 32.

కృష్ణ—లోకాపకారులు సుతులయినను వధ్యులే.

సత్య—భగవంతుఁడు దక్కఁ దదన్యు లట్లు సలుపలేరు.

పుల—ఓయదుకుంజరా! ఇంక వేయుమాట లేల?

తే. గీ. వైదికము లైనకర్మముల్ వలదటంచుఁ
జెప్పి మాచేతి మానిపించినను సరియె

బృహ—పుత్రవాత్సల్యమును ద్రోసిపుచ్చి వేగ
చెనఁటి యసురను సంహరించినను సరియె. 33.

కృష్ణ—అట్లయిన నోతాపసులారా! ఇటు వినుండు. ఆదురాత్ముఁడు

మ. ధరణీగర్భము దూఱినీ పఱచి పాతాళంబునన్ దాఁగనీ
శరధిన్ మున్గి యడంగనీ భువనముల్ సంక్షోభముల్ బాయఁగా
నరకున్ దుస్సహ సంగరస్థలవిఘూర్ణచ్చక్రధారాహతిన్
మరలన్ వైదికమార్గముల్ నిలిపి ధర్మంబున్ బ్రతిష్ఠించెదన్. 34.

ఋషులు—తథాస్తు. తథాస్తు. తథాస్తు. (అని చేతులెత్తి)

శ్లోకము. జయతుజయతుదేవో దేవకీగర్భజాతో
జయతుజయతుచక్రం నిర్దళద్దైత్యచక్రం
జయతుజయతువేద శ్శాశ్వతానందనాదో
జయతుజయతుధర్మో వైదికోత్కృష్టశర్మా. 35.

కృష్ణ—మహాత్మల యాశీర్వచనము లమోఘములయి జయప్రదము లగుఁగాక!

సత్య—మహాత్ములు సంకల్పసిద్ధు లగుట మీ రెఱుంగరా?

పుల—మధుసూదనా! కుమారుండు తారకుని, ధూర్జటిపురదైత్యులను, పిల్కుమార్చి జయంబు వడసిన తెఱంగున నీవును నరకుం గెల్చెదవు. కాని నీవు కడుజాగరూకుఁడవై మెలంగవలయునుమా! వాఁ డసాధారణతేజోదుర్నిరీక్ష్యుఁడు, దుర్జయు

దోర్బలనిర్జితనిర్జరేశ్వరుఁడు. వీనిమరణవార్త నెప్పుడు విందుమా యని మేము మాచెవులు నిక్కఁబెట్టుకొని యుందుము.

బృహ—దేవా! నేను నించుక చెప్పఁ దలఁచుచున్నాఁడను. ఆవధరింపుము.

చ. కుటిలుని సోమకాసురునిఁ గూల్చుట కూల్చుటగాదు సూ మహా
కిటి వయి హేమలోచనుని గెల్చుట గెల్చుట గాదు సాహసో
ద్భటు బలి భూతలంబునకుఁ బంచుట పంచుట గాదు శౌర్యలం
పటునరకాసురుం బిలుకు మాన్చుట మాన్చుట గాక యచ్యుతా! 36.

కృష్ణ—మహర్షులారా! నాకోపబలంబునకు మీశాపఫలంబు సాయమై వానికి మరణ మాపాదించు.

పుల—అట్లయిన మే మింక నాశ్రమంబులకుఁ బోయి భయవిహ్వలులగు తక్కినమునుల కీశుభవార్త నెఱిఁగించెదము.

కృష్ణ— ఓయీ! ఎవఁ డక్కడ?

దేవ—(ప్రవేశించి) దేవా! ఇదిగో వచ్చితి నాజ్ఞాపింపుము.

కృష్ణ—దేవలా! ఈమహర్షులను సాగనంపుము.

దేవ—చిత్తము (అనితనలో) మఱ్ఱియూడలవలె జడలు పిచ్చికగూండ్లవలె జుట్లు గల యీటక్కరిమునులఁ జూచినతోడనే నా కరకాలిమంట నెత్తికివచ్చెను. వీండ్రేవో కల్లమాటలు చెప్పి కృష్ణుని తమవలలో వేసికొనిపోవుచున్నారు. ఆరక్కసి ముండకొడుకులు కొట్టినప్పుడు వీండ్ర మరల నిక్కడకు రాకుండునటులు కొట్టలేరైరి పోనీ పోవలదని కృష్ణునితోఁ జెప్పుదునా ? అయిన నా కెందుకు? (ప్రకాశముగా) ఋషులారా! పోదమురండు. (అని ఋషులతో నిష్క్రమించును.)

కృష్ణ—దేవీ! మునుల మనోవైక్లబ్యముచే నాచిత్త మెంతయు జాలినొంది యున్నది. కావున లోకకంటకుఁ డగు నానరకుని నిప్పుడ పోయి శిక్షించెదను.

సత్య—నా చిన్నవిజ్ఞాపన మొకటి యున్నది. మీరు పగతు నెదుర నిలిచి యతి లాఘవంబున నసహాయశూరులయి పోరునపుడు కన్నులపండువుగ మి మ్మొకసారి చూడవలయునని నాకుఁ జిరకాలమునుండి యభిలాషకలదు. రసికశిఖామణు లగుదేవరవారీముద్దు సెల్లింపవలయునని వేఁడుచున్నాను.

కృష్ణ—దేవీ! ఇది యేటికోర్కె.

మ. నగలా నాణెములా యమూల్యమణులా నవ్యాంబరశ్రేణులా
సొగసుం జేడియలా జగానగరులా చొక్కంపుఁ బూఁదోఁటలా

మగువ లొక్కరుఁగరానికోరికల నిమ్మాటిక్కన్నను స్వేచ్ఛఁగాఁ
దగునే చూడఁగలారె యంగనలు భీతిల్లక కయ్యంబులన్. 37.

సత్య—ప్రాణేశ్వరా!

మ. నగలు న్నాణెములుం బ్రశస్తమణులు న్నవ్యాంబరశ్రేణులన్
సొగసుంజేడియలున్ జగానగరులన్ జొక్కంపుఁబూఁదోఁటలన్
మిగులం జేసితె మీయనుగ్రహమునన్ మీవెంటఁ గొంపోవుచే
నగలు న్నాణెము లౌను నాకుఁ గరుణ న్నాపద్దు దెల్లింపరే. 33.

కృష్ణ—దేవీ! నీ వలుగకుందువేని నే నొకమాట చెప్పెద. యుద్ధమన నేమిగాఁ దలఁచుచుంటివి ?

సీ. కదలుకొండలఁ బోలు గజతండములె కాని గండుతుమ్మెదపిండు లుండ వచట
క్రూరదానవచమూకోలాహలమె కాని యొఱపుఁగోయిలకూఁత లుండ వచట
కుటిలదైత్యులమేనిక్రొన్నెత్తురులె కాని యొసపరిపూఁదేనె లుండ వచట
పరసేన విడిసెడుబయటినేలలె కాని యొప్పారుసౌధంబు లుండ వచట
ఘూకకాకగృధ్రములు మూఁగుటయె కాని
చిలుకగోరువంక నెమ్మియుఁ జేర వచట
పొలసుదిండిపీనుంగులపొలయె కాని
యలరు నెత్తావి గమగమ లమర వచట. 39.

సత్య—రణరంగ మట్లుండునని నే నెఱుంగకపోలేదు. కావున నాయాగమనమున కనుమతింపుఁడు. మఱియు

తే. గీ. సగము దేహంబు నింటిలోఁ జక్క విడిచి
యనికి మీరు వోవుట యేటిన్యాయ మనఘ
కృష్ణ—యెనిమిదిసగంబు లున్నవో యిందువదన
యేసగంబును గొనిపోదు నిప్పు డేను? 40.

సత్య—ఏసగంబు మీవెంట రాఁదలఁచుకొన్నదో యాసగమును గొంపొండు.

కృష్ణ—దేవీ! రణమునఁబోవుచు రమణుల వెంటఁబెట్టుకొని పోరాదు జయాపజయములు మునుమున్న నిర్ణయింపఁజాలము. ఒకవేళ నాకుఁ బరాజయంబే సంభవించునేని నేను నిన్ను రాక్షసులబారినుండి సంరక్షించుట దుర్లభముకదా!

సత్య—ఏమి! పరాజయమా? మీ రొక్కరే సమరమునకుఁ బోయినను బరాజయ ముండదు. అందు నేను మీసన్నిధినుండ నట్టిది తలంపరాదు.

కృష్ణ—నీవు నాకుఁ బరాజయము కలుగకుండ నేమిచేయుదువు ?

సత్య—సీ. ఆహవంబున మీఱ లలసినప్పుడు మేనిచెమ్మటల్ దుడిచెద జేలఁగతోడ
నరిమేనశరపరంపర లేయఁ దమకింప నలుఁగు లందిచ్చెద నండనుండి
సూతుండు శ్రాంతుఁడై సొమ్మవోయినవేళ నరదంబు గడపెద ననువెఱఁగి
పగతుండు చెలరేఁగి పయిపయిం గవిసినఁ బుఁకొల్పి పంచెదఁ బోరఁ గర్వ
మఱుచుపనులను జ్ఞప్తికి మరలఁ దెత్తుఁ
గలసి చేదోడు వాదోడుగాఁ జరింతు
వేయు నేటికి హృదయేశ విను తెలిపెద
వాలుఁ గైకొనిపోరెద వలయునేని. 41.

కృష్ణ—దేవీ! ఇంతకాలమునుండి నీకిట్టిప్రజ్ఞ లుండుట నే నెఱుంగనయితి. ఎన్నఁడు నేర్చితివి?

సత్య—దేవా!

తే. గీ. విల్లు వంచుట కూర్చుట వింటనారి
నలుఁగుఁ దొడుగుట యేయుట యదనెఱుఁగుట
రథముఁ దోలుట మొదలైనరణపుఁబనులు
చిన్ననాఁటను మాతండ్రి చెప్పెఁ గొంత. 42.

కృష్ణ—దేవీ! నిన్నుఁ దోడ్కొనిపోవుట కెంత సమ్మతించుకొన్న నామనసొప్పకున్నయది. వలగన్న నీ వాగ్రహింతువు పట్టపుదేవియయ్యు రుక్మిణి యెన్నఁ డిట్టి కోరికలు కోరియెఱుంగదు.

సత్య—ఔను నిశ్చయమే.

చ. అనయము భోజరాజసుతయట్టులు జాణను కానుగాని నా
పనుపులు మీ రొనర్చుటకుఁ బట్టపుదేవిని కానుగాని నే
నును నొకరాచకన్నియనె న్యూనత కోరువ నింతమాత్రపుం
జనువుల కేనియుం దగదు సత్య యటంచును నేఁ దెఱిఁగితిన్. 43.

(అని పోఁబోవుచున్నది.)

కృష్ణ—(చేయిపట్టుకొని) సుందరీ! పోకు. పోకు. స్మరచాపంబులఁ బోలు నీ కనొబొమలు ముడువకుము. ఇదిగో నావెంటవత్తువు. పయనముగమ్ము.

సత్య—నే నిప్పు డనుగ్రహింపఁబడితిని. రండు పోదము.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీ

# ప్రసన్నయాదవ నాటకము.

## చతుర్థాంకము.

ప్రవేశము—ప్రాగ్జ్యోతిషపట్టణమునందలి బయలు.

[అప్పుడు వజ్రకంఠుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వజ్ర—(తనలో) కటకటా! ఈదానవులసంపదలు కనుబొమ్మలమీఁది వెండ్రుకలవలె నెప్పటికిని నెదుగుఁబొదుగులేక యొకమచ్చుననే యున్నవిగద. ఎవఁడో యొక దైత్యుఁడు బాహుబలముచే వేల్పుల గెలిచి విజృంభించినపుడు వానిసాయంబుఁ జూచుకొని మే మందఱము గాలికి లేచి యాఁకు యెంగిలివిస్తరాకులవలె విఱిసిపడి యావీరుని యధికార మడఁగినతోడనే మరల నొదిఁగి యుందుము. బలిసినదున్నపోతు నాశ్రయించిన గోమారులవలె బలగర్వితుఁడగునరకమహారాజు నాశ్రయించి సుఖపడు నీరాక్షసులగతి యేమగునోకద!. ఈనరకమహారాజునకు మఱియెవరితో యుద్ధము వచ్చిన నేను జంకను; కాని బలుటక్కరియు దుస్స్వభావుఁడు నగు వాసుదేవునితో నిప్పుడు యుద్ధమువచ్చెను గాన నేను విజయమునుగూర్చి సందేహించుచున్నాను. ఈవాసుదేవహతకునిచేత దేవాసుర యుద్ధములయందయిన వెను కంజవెట్టి యెఱుంగని యసహాయశూరు లగు రాక్షసప్రవరు లనేకులు నిష్కారణముగ వధింపఁబడిరి. ఇంతకు మాదినములు మంచివి కావు. అయిన నప్రతిహతప్రతాపుఁడగునరకుఁడు శ్రీకృష్ణుని మూర్ఛిల్లఁజేయుటచే మాకే విజయమగునని యించుక ధైర్యము గలిగినది. ఇదిగో మందపాలుఁడిటే వచ్చుచున్నాఁడు. వీఁ డెందుండి వచ్చుచున్నాఁడో తెల్సికొనియెద

[అంతట మందపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

మంద—(తనలో) ఏమి చెప్పుమా! మావజ్రకంఠుఁ డొక్కఁడు నిచ్చట నిలుచుండి యేదో యోచించుచున్నాఁడు. నే నీనడుమ గ్రామములో లేనప్పుడు విశేషము లేవైన జరిగినవేమో వీని నడిగి తెలిసికొనియెద. (సమీపించి) వజ్రకంఠా! విశేషము లెవ్వియు లేవుగదా!.

వజ్ర—విశేషములు నన్నడుగుచున్నావేమి నీ వెఱుఁగవా?

మంద—నే నీనడుమ గ్రామమునందు లేను.

వజ్ర—ఏగ్రామ మెందునిమిత్తము పోయితివి?

మంద—చెప్పెద వినుము. నాభార్య మూఁడునెలలక్రిందట పుట్టినింటికిఁ బోయినది ఆమె యక్కడ నుండఁగ నే కిట్టనిముండకొడుకు లెవరో పదిదినములక్రిందట రాత్రివేళ వచ్చి నన్నుఁ బిలిచి యోరీ! నీభార్యకు వైధవ్యము సంభవించినది; కాన నీవు పోయి చూచిరమ్మని నాతోఁ జెప్పిపోయిరి. పెండ్లి చేసికొన్నభార్య యంతదుఃఖములో నున్నపుడు పరామర్శ చేయకపోవుట బాగుండదని నేను మరునాఁ డుదయముననే బయలుదేరి పోయి చూచితిని.

వజ్ర—పాప మాబిడ వైధవ్యదుఃఖముచేత బాధపడుచున్నది గాఁబోలు.

మంద—అబ్బే! వైధవ్యము లేదు ఏమిలేదు. పసుపుకుంకుమ బెట్టుకొని కలకలలాడుచు మహాలక్ష్మిలాగున నాకెదురువచ్చినది. మాదంపతులపొందిక చూచి యోర్వలేక కిట్టనివాం డ్రట్టివాడుక వేసిరి.

వజ్ర—ఓరీ! నీ వుండఁగ నీభార్య ముండమోయునా?

మంద—అదియేమిమాట నేనుండఁగ లోకమునం దింతమందియాఁడువాండ్రు ముండమోయఁగ నాభార్యమాత్ర మేల ముండమోయఁగూడదు? కానికాలములు వచ్చినవి ఏవేళ కేమో యెవ్వఁ డెఱుఁగు.

వజ్ర—సరే. నీచరిత్ర బాగున్నది. ఇక్కడివిశేషములు చెప్పెద వినుము. మన నరకమహారాజుగారిమీఁద మూఁడుదినములక్రిందట శ్రీకృష్ణుఁడు దండెత్తివచ్చె. అప్పటినుండియు నతనికిని రాక్షసవీరులకును ఘోరయుద్ధములు జరుగుచున్నవి.

మంద—(ఆశ్చర్యముతో) శ్రీకృష్ణుఁడు దండెత్తి వచ్చెనా? (కొంచె మాలోచించి) అయినను భయములేదు. మహాశూరుఁడు మురుఁడు లేఁడా?

వజ్ర—లేకేమి యున్నాఁడు.

మంద—ఎక్కడ?

వజ్ర—పరలోకమున.

మంద—ఏమి! అతఁడు మృతి నొందెనా? ఎంతకష్టము! నిశుంభుఁ డేమయ్యెను?

వజ్ర—పాపము మురుఁ డొక్కఁడుఁ బోవలేక చిరమిత్రుఁ డగునిశుంభుని వెంటఁగొనిపోయెను.

మంద—కటకటా! నిశుంభుఁడు నిహతుఁ డయ్యెనా? ఇంక దిక్కెవ్వరు. పంచజనుఁ డున్నాఁడు కదా!

వజ్ర—ఈనడుమ నతఁడు తండ్రిని జూడఁబోయినాఁడు.

మంద—అయ్యయో! హయగ్రీవుఁ డయిన వాసుదేవు నెదుర్కొనలేదా?

వజ్ర—అయ్యో! ఎదుర్కొనకేమి. అతఁడు కొంతసేపు పోరిపోరి నిన్న సాయంకాలమే రంభాసంభోగార్థమై చనెను.

మంద—అయ్యయో! సమరమునకు పంచజనహయగ్రీవు లిద్దఱు లేకపోయిరే! వారాపనులమీఁద నిప్పుడేపోవలయునా? మరియొకప్పుడు పోరాదా, వారినిప్పు డేల పిలిపింపఁగూడదు.

వజ్ర—పిలుచుటకుఁ దగినవా రెవ్వరు లేరు. నిన్నే పంపఁ దలఁచుచున్నారము. పోవుదువా?

మంద—అయ్యో పోకేమి స్వామి కార్యము చేయనా?

వజ్ర—అట్లయిన శ్రీకృష్ణునియెదుటకుఁ బోయి నిలువుము. అతఁడే నిన్నుఁ బంపఁగలఁడు.

మంద—ఓరీ! దుర్మార్గుఁడా! నన్ను చావు మనుచున్నావా?

వజ్ర—చావకుండఁ జచ్చినవారియొద్ద కెట్లు పోఁగలవు.

మంద—యట్లయిన పంచజనహయగ్రీవులు చచ్చినారా?

వజ్ర—చావక బ్రతికియున్నారా?

మంద—నీకడుపుకాల! నీమాట లెప్పుడు నిట్లే యుండును. ఏసంగతియు సరిగాఁ జెప్పక నడ్డదిడ్డముగఁ జెప్పెదవు. ఇప్పుడు మహారాజుగా రేమి చేయుచున్నారు?

వజ్ర—ఆయన యుదయమునుండియు శ్రీకృష్ణునితోఁ బోరుచున్నారు. ఇప్పటివఱకు మనపక్షము సబలముగానే యున్నది. మహారాజుగారు శక్తి నొకదానినిఁ బ్రయోగించి వాసుదేవుని మూర్ఛపుచ్చినారు. అందుచే మాకించుక ధైర్యము కలిగినది.

మంద—ఆదెబ్బతో వాఁడు చచ్చెనా లేదా?

వజ్ర—లేదులేదు వానిభార్య మూర్ఛితుఁడైనభర్తను సేదదేర్చి విల్లు గైకొని దనుజలోకభయంకరముగ యుద్ధము చేయుచున్నది.

మంద—ఏమిచిత్రము. ఆఁడుదియా యుద్ధము చేయుట. ఔరా కాలమహిమ.

వజ్ర—అది యాఁడుదిగాదురా బాబు; నూఱుమందిమగవాండ్రను జంపిపుట్టినది. మతిమాలినముండకొడుకు బ్రహ్మదేవుఁడు పిడుగువంటి మగవానిని జేయఁదలఁచి పొరబడి యాఁడుదానినిగాఁ జేసెను. ముల్లోకములు జయించిన మనమహారాజుగారి నామె యిప్పుడు ముప్పతిప్పలు పెట్టి మూడుచెఱువులనీళ్ళు త్రాగించుచున్నది. ఇన్నాళ్ళు

బ్రతికి యింటివెనుకఁ బచ్చె నన్నట్లు మహేంద్రాదుల గెల్చిన దానవసార్వభౌముఁడు తుద కాఁడుదానిచేతఁ బడు నేమో యని భయము కలుగుచున్నది.

మంద—సరే. ఇంక మనదారి మనము చూచుకొనవలసినదే. నీప్రాణరక్షణ మెట్లు చేసికొనియెదవు.

వజ్ర—మనము కామరూపులము గద. అందుచేత నేను నందినో పందినో కుక్కనో నక్కనో పిల్లినో నల్లినో బల్లినో గొల్లినో కేకినో కాకినో చీమనో దోమనో రాయినో అప్పనో చెట్టునో చేమనో నయి ప్రాణములు దక్కించుకొనియెద. నీ వెట్లు దక్కించుకొనియెదవు?

మంద—నేను నీవలె తుచ్ఛజంతువునై ప్రాణములు గాపాడుకొనను. నే నేనుఁగు నయ్యెదను.

వజ్ర—ఏనుఁగు వగుట యబద్ధము. పీనుఁగు వగుట నిజము.

[తెరలో]

క. అని దివిజేంద్రుని గెల్చిన
దనుజేంద్రుఁడు మూర్ఛనొందెఁ దనయరదముపై
మనుజాంగనచే హతుఁడై
వినిరే యెవరైన నిట్టివింతలు జగతిన్. 1.

వజ్ర—హా! చచ్చితి; చచ్చితి.

మంద—అయ్యో! అయ్యో! ఇంక దిక్కెవ్వరు?

వజ్ర—(పరికించి చూచి) ఇదిగో గరుడధ్వజముగల శ్రీకృష్ణునిరథమును సారథి యీవైపునకే తోలుకొనివచ్చుచున్నాఁడు. నరకమహారాజును మూర్ఛిల్లఁ జేసిన యా బాలిసకూఁతురు నిన్నును నన్నును చెఱియొకబాణమున కెరఁజేయఁగలదు. కావున నిప్పుడే కాళ్లసత్తువకొలఁది పరుగెత్తుదము రమ్ము.

మంద—ప్రస్తుత మింతకన్న వే ఉపాయము లేదు పదపద.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము

[అంతట రథారూఢులై శ్రీకృష్ణసత్యభామలును రథముఁ దోలుచు సారథి యగుదారకుఁడును బ్రవేశించుచున్నారు.]

దార—దేవా! దేవీ! నరకుఁడు మూర్ఛనుండి తేఱువఱకు నరదము నీమఱ్ఱిచెట్టు నీడ నిలిపెదను. రణరంగమున వీరవిహారము సలిపినదంపతుల కిందలి మందమలయసమీరణము లుపచారము చేసి శ్రమ మపనయింపఁ గలవు.

సత్య—దారకుఁడా! నీవు చక్కనిపనిఁ జేసితివి. ఇప్పుడు ప్రాణేశ్వరుని యాయాసము సంపూర్ణముగ నపనయింపఁబడు.

కృష్ణ—సుందరీ! ఇందు నాశ్రమ మేమున్నది. శ్రమమంతయు నీదే. ఏలయన

చ. మఱుకుమఱుక్కు మంచు మెయి సోఁకగ దానవుఁ డమ్ము లేయుడున్
మెరమెర దోప నేను మిసిమింతుఁడనై పడియుండఁ జూచి నీ
చెలఁగునఁ జెమ్మటల్ దుడిచి చేతిధనుస్సు గ్రహించి దానవుల్
వెఱచఱవన్ బొనర్చితివి వీరవిహారము మెచ్చ నెల్లరున్. 2.

సత్య—శరీరమం దలఁతఁ జెందిన యవయవములు విశ్రాంతిఁ జేకొనుచుండ నలఁత వడని యవయవములు పని సేయుట ప్రకృతిసిద్ధము గదా. అందుచే నర్ధశరీర మలసి నప్పుడు తక్కినసగము మేను సమరము నడపినది.

కృష్ణ—కళ్యాణి!

తే. గీ. సాటి యెఱుఁగని నీమేని చక్కఁదనము
ముందు సతు లెంత సిగ్గును బొందఁగలరో
ప్రతి యెఱుంగని నీపరాక్రమముముందు
పురుషు లంతియసిగ్గును బొందఁ గలరు. 3.

సత్య—దేవా! ఇందు నాప్రజ్ఞ యేమున్నది.

తే. గీ. కారణంబులు దీనికిఁ గలవు రెండు
కమలనాభ మీసాన్నిధ్యగరిమ యొండె
పగతుదౌర్బల్య మొండెఁ గావలయు సుమ్ము
కాక నే నేమి దైత్యులఁ గలఁచు టేమి. 4.

కృష్ణ—ఈరెండును గారణములు కావు. ఇది కేవలము వినయవృత్తి. పగతుని చేత నలయింపఁబడిన నేను నీవిజయమునకుఁ గారణ మెట్లగుదును ?

క. ఎగిరిపడితి నిన్నాళులు
మగవాండ్రభుజాబలంబు మాట గనక సి

గ్గగు నిప్పుడు మీముందర
మగువా! యిఁక సాగిరావు మామగతనముల్. 5.

మఱియు

తే. గీ ద్వాపరమ్మున రెండుచిత్రములఁ గంటి
జలజలోచన నీసాహసంబుకతన

సత్య—ఆచిత్రములు వినఁగోరెద.

కృష్ణ—ఆఁడువారికి పౌరుషంబనుచు టొక్కటి
యబలభావంబు మగవారికబ్బు టొకటి. 6.

దార—ఇందతిశయోక్తి యేమియు లేదు.

సత్య—అఘటనఘటనాసమర్థు లగుపరమేశ్వరులు స్వయముగ సమరవ్యాపారము నడపుచుండ నట్టిచిత్రములు పొడకట్టుట యొకవింత గాదు.

కృష్ణ—కళ్యాణీ! నీసుశీలముచేత నీవిజయము నాకారోపించుచున్నదానవు; కావున నేను దానిని బరిగ్రహించుచున్నాఁడను.

దార—వీరపుత్రికయు వీరపత్నియు నగు నీదేవిచరిత్రము మహిషాసురుని మర్దించి దివిజలోకమును నిష్కంటకముగా నొనర్చి వామదేవునకు మహానందము గలిగించిన కాత్యాయనివృత్తాంతమును దలఁపించుచున్నది.

కృష్ణ—దారకా! నిజము నిజము. ఈమె చరిత్ర మట్టిదే. ఓసుందరీ! ఆసమరసమయమున నీరూపము మిక్కిలి దర్శనీయమయి యుండెను. ఎట్లంటేని.

సీ. శ్రమమునఁ బొడమిన చెమటచిత్తడిచేతఁ గస్తూరితిలకంబు కరఁగిపోవ
నృత్యముం బొనరించు నెమలిపింఛియపట్లు వెడఁదవేనలి జాఱి వెన్నునిండ
తియ్యవిల్లుం దూఁగుతీఁగెయుయ్యెలలట్టు లాణిముత్తెపుసరు లల్లలాడ
గుణనినాదమునకు గొనబైనలయవోలె ముంజేతికడియముల్ మొరయుచుండ
నవనవాంగకములశోభ నవయకుండ
నవక మించుకయేనియు నలఁగకుండ
వెడఁదతూపులు చూపులు వింటఁ గంటఁ
బసునిమీఁదను నామీఁదఁ బరపితబల. 7.

సత్య—ఈవిజయము ఘుణాక్షరన్యాయముగ లభించినదైన నీస్వల్పకార్యముచేత మీమెప్పునకుం బాత్రురాల నయితినని సంతసించుచున్నదానను.

దార—దేవా! ఇంతవఱకు పురుషులేగాని స్త్రీలు సాంగ్రామికవ్యాపారములకుఁ దగువారు కారని నేఁదలఁచితి. ఈపూజ్యురాలి యతిలోకచాతుర్యముచేత నే నా యభిప్రాయమును మార్చుకొనవలసె.

సత్య—దారకా!

క. మగవారి నెల్లపనులకుఁ
దగువారినిగా నొనర్చి దైవము స్త్రీలన్
దగనటుచేసెనె మగువలు
తగియెదరో తగరొ దైత్యదమనుఁడె యెఱుఁగున్. 8.

కృష్ణు—దారకా! అంగనలు

మ. చదువన్నేర్తురు పూరుషుల్బలెనె శాస్త్రంబు ల్వశింపించుచో
నదమన్నేర్తురు శత్రుసేనల ధనుర్వ్యాపారము ల్నేర్పుచో
ముదితోత్సాహముతోడ నేలఁగల రీయుర్విన్ బ్రతిష్ఠించుచో
ముదితల్నేరఁగరానివిద్య గలదే ముద్దార నేర్పించినన్. 9.

దార—దేవా! స్త్రీలు ప్రకృతిసుకుమారలగుటచేఁ బురుషప్రాపణీయము లగు మోటుపనులకుం దగ రనుకొంటి.

కృష్ణు—పువుబోండ్లమేనులు సహజముగ మృదువు లయినను గాలానుగుణముగ శ్రమము సహింపఁగలవు.

తే. గీ. కరము స్పృశియించుమాత్రానఁ గందిపోవు
మల్లె సంపఁగిలోనగు మంచిపువులు
పృథివి శోషిల్ల గాడ్పులు విసరునట్టి
మండువేసఁగిఁ బొదలుచు నుండుఁ గాదె. 10.

[తెరలో]

ఓరోరి యాదవపాంసనా! భార్యాభుజబలార్జితయశోగర్వితా! నిలునిలు పాఱిపోకు.

మ. అని నే మూర్ఛిలినంతమాత్రమున దైత్యస్వామి నాచేత నీ
ల్గినవాఁ డంచును సంతసించి నను గేలిం గొట్టుచున్నాఁడవా?
వినునామూర్ఛకుఁ గారణంబు వనితావిక్రాంతియే గాని నీ
ఘనదోస్సారము కాదు సిగ్గుపడక కీగర్వంబు నీ కేలరా? 11.

సత్య—పిడుగువంటి యీధ్వని యెవ్వనిది?

దార—ఇది నరకునికంఠధ్వనియే.

కృష్ణు—హృదయేశ్వరీ!

తే. గీ. మొదట నీవాఁడితూపుల మూర్ఛవోయి
యసుర క్రమ్మఱఁ దెలివొంది యని యొనర్ప
నలుక రెట్టింప మనపైకి నరుగుదెంచె
నేటువడిన బెబ్బులివోలె నెగిరిపడుచు. 12.

[అప్పుడు రథ మెక్కి సూతసమేతుఁడై నరకాసురుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సూతు—రాక్షసేశ్వరా! ఇదిగో శ్రీకృష్ణుఁడు రథారూఢుఁ డయి యుందున్నాఁడు.

నర—ఓరోరి యాదవపాంసనా! భార్యాభుజబలార్జితయశోగర్వితా! నిలునిలు పాఱిపోకు.

మ. అని నే మూర్ఛిలినంతమాత్రమున దైత్యస్వామి నాచేత నీ
ల్గినవాఁ డంచును సంతసించి నను గేలిం గొట్టుచున్నాఁడవా?
విను నామూర్ఛకుఁ గారణంబు వనితా విక్రాంతియే గాని నీ
ఘనదోస్సారము కాదు సిగ్గుపడ కీగర్వంబు నీ కేలరా? 13.

కృష్ణ—ఓరోరి నిశాటకులపాంసనా! ఇందు మాకు లజ్జాకారణము లేదు.

క. మాయింటియాఁడువాండ్రు న
జేయుల మని విఱ్ఱవీఁగు చెనఁటి యసురులన్
మీయట్టివారి గెలువఁగ
నాయత గర్వంబె గాక యట సిగ్గేలా? 14.

మఱియు నోశిశితాశన!

తే. గీ. అష్టదిక్పాలయుతుఁ డైనయమరవిభుని
వ్రేల్మిడిని జయించినమహావీరుఁడ వయి
యాఁడుదానిచేఁ దుద కిట్టు లయితి ననుచు
సిగ్గుపడి చావ కిట్లు వచ్చితివి మరల? 15.

నర—ఓరీవాచాట! మీయింటియాఁడువాండ్రు సాహసము కలవారె. ఇందు నీవు నిజమే పలికితివి.

ఉ. కొంకక నీదుచెల్లెలు తగుల్కొనిపోయెను బాండుపుత్రునిన్
జంకక రుక్మిణీరమణి నాఁడు తగుల్కొని వచ్చె నిన్ను నీ
వంకఁగ నున్న యంగనలప్రజ్ఞలకా గరువించుటెల్ల చీ
యింకను నీది యొక్కబ్రతుకే యని మాటల నాడఁ జొచ్చితే? 16.

మఱియు నియ్యది నీకు గౌరవమే యయినపక్షమున,

చ. అలయక సత్యభామమగఁడై నిను నేలుచునుండు నింటగా
జులు తొడిగించుకొంచు నొకచోటను గూరుచునుండి భార్యవై
మెలఁగుము దానికిన్ మగఁటిమిన్ బెడబాసినభర్త భర్తయే
పొలియక యప్పుడే బ్రతికిపోతివి దగ్గఱ భార్య యుంటచేన్. 17.

దార—ఆయుష్మంతుఁడా! మరియాద నతిక్రమించి నడచువారితోఁ బ్రసంగించు టొప్పదు.

కృష్ణ—దారకా! అగును. ఏదీ వి ల్లిటు దెమ్ము.

సత్య—ప్రాణేశ్వరా! ఒక్కసారి మీ రూరకుండుఁడు. వీనితో నే నించుక ప్రసంగించెదను.

—సుందరీ! అనఁదగినమాటయు ననఁదగనిమాటయు నెఱుఁగనిరాక్షసుఁడుసుమీ యితఁడు. అంతియగాక నీబాణప్రహారములచే నీవలను మనసు నొచ్చియున్నవాఁడు గావున మహాభిజాత్యముగల నిన్ను వీఁడు గౌరవింపఁ డని తోఁచెడును. మఱియు

తే. గీ. చెనఁటికి హితోపదేశంబు చేయుటరయఁ
బెద్దపులికి ధర్మములు చెప్పెడుతెఱంగు
కఠినులకుఁ గృపఁ గలిగింపఁ గడఁగు టెల్ల
రాతినేలల నూతులఁ ద్రవ్వుటబల. 18.

సత్య—అది నే నెఱుఁగుదును. అయినను న న్నొకసారి పలుకనిండు. ఓప్రాగ్జ్యోతిషాధీశ్వరా! ఇంచుక శాంతింతువేని యొక్కమాట చెప్పెద.

చ. పొడమితి వాదిదేవునకు భూసతికిన్ బ్రియనందనుండవై
యడఁచితి వష్టదిక్పతుల ఖ్యాతి వహించితి విట్టు లుండియున్
గడపితి వింతకాలమును గ్రౌర్యమె సేయుచు నింక నేనియున్
జెడక ముకుందుపాదసరసీరుహముల్ భజియింపు భక్తితోన్. 19.

వెండియు నితఁడు.

తే. గీ. మునులకేని జిక్కనివాఁడు మొదటివాఁడు
పతితులను బావనులఁ జేయువ్రతమువాఁడు
తొంటిపుణ్యంబునను నీకు దొరకినాఁడు
భక్తి భజియింపఁ గదవయ్య పరమపురుషు. 21.

నర—ఓసత్రాజిత్పుత్రీ! ఏమీ! నీమగండు పరమపురుషుఁడా? ఈజగద్వంచకుఁడు భగవంతుఁ డెట్లయ్యెనో చెప్పెద వినుము.

మ. తెలి వొక్కింతయు లేనితాపసులు నీతిభ్రష్టుఁ డౌకృష్ణు అం
కులుబొంకు ల్వెయినోళులం బొగడుచుం గోరంత లౌ తద్గుణం
బులు కొండంతలు చేసి విష్ణుఁ డని సంపూజింప నౌనౌ బళా
బళి నేనే హరినంచు సిద్ధ మయి తా వచ్చెంద్రపాహీనుఁడై. 21.

క. భగవంతునియవతారం
బగు నని వర్ణించుచుంటి వబలా వీఁడా
భగవంతుఁడు ఛీ వీఁడే
భగవంతుం డైనజనులపా ల్లే మందున్. 22.

మఱియు

ఆ. వె. ఉల్లి మల్లె యౌనె పిల్లి బెబ్బులి యౌనె
కాకి కేకి యౌనె కలువకంటి
కుక్క గుఱ్ఱ మౌనె గో వౌనె గోమాయు
వాదిదేవుఁ డౌనె యాదవుండు. 23.

సత్యభామా! ఇతఁడు నీపతి యగుటచే నభిమానవశంబున నిట్లు పలుకుచుంటివి.; కాని మావంటి యుత్తమపురుషులు వీని నాశ్రయించుటకు వీనియం దేమిగుణము లున్నవి.

సీ. కులగౌరముఁ జూచి కొనియాడు మందువా యదువంశజునికన్న నధము డెవఁడు
విక్రమంబును జూచి వినుతింపు మందువా వాసుదేవునికన్న పంద యెవఁడు
అభిమానధనుఁ డంచు నగ్గింపు మందువా నీప్రాణపతికన్న నీచుఁ డెవఁడు
సుగుణసంపద మెచ్చి స్తుతియింపు మందువా గోపాలునికన్న కూళ యెవఁడు
యేలుటకు నంగుళంబేని నేలలేక
పాండుసుతులపంచను జేరి బ్రతుకువాని
కులము బలమును [illegible]ంబు గుణము గలిగి
నెగడు నే నేమి చేరి మన్నించు టేమి? 24.

ఓవీరపుత్రీ! పగతుఁడ నైనను నేను నీవిషయమై జాలినొందుచున్నాఁడను. ఏలయన

క. చక్రినిచక్కవు గదె నీ
కెక్కరణిని దాపురించె నీతుంటరి ని
న్నిక్కుమతి కిచ్చుట రుచుల్
గ్రక్కెడుమణిని మసిపాఁతఁ గట్టుట గాదే? 25.

నీసాహసంబునకుఁ జక్కఁదనంబునకుఁ గులగౌరవంబునకుఁ దగనిమగనిం గట్టుకొని నీవు హాస్యాస్పదురాల వైతివి.

దార—ఓయీ! రాక్షసా! మహామహిమలచేత నీయితఁడు పరమపురుషుఁ డని జ్ఞాను లందఱుఁ దెలియుచుండ నీ వెఱుఁగఁజాలవా?

నర—ఓహో! మహిమలవలన జ్ఞాను లెఱింగిరా?

తే. గీ. తొడిదొంగలౌ మునులను గూడఁ గట్టి
గడుసుఁదన మెఱుంగనివారికన్నుఁ బ్రామి
మాయ లింద్రజాలములు వేమాఱు చేసి
నంతమాత్రాన భగవంతుఁ డగునె వీఁడు. 26.

సత్య—దేవా! ఇంతగా రేఁగిన యీదనుజానిపొగరుదుమారము మీశరాసారము చేతఁగాని యడఁగదు.

—దేవీ! నేను మొదటఁ జెప్పలేదా?

తే. గీ. సన్నిపాతసంగత మైనజ్వరముచేత
నొడ లెఱుంగక ప్రేలుచు నున్నరోగి
చేవ గలవేఁడిమందులచేతఁ గాక
చక్కఁబడునొక్కొ శైత్యోపచారతతుల. 27.

అందుచేత నే నే వీనిదుర్మద మడంచెద. నీ వుండుము.

సత్య—హృదయేశ్వరా! అవును. నే నొకసారి వీనిని మూర్ఛపుచ్చఁ గలిగితిఁ గాని సంహరింపఁజాల. ఖండితానేకదైత్యేంద్రమస్త మగుమీహస్తమే వీనిని విధ్వస్తము గావించుఁగాక!

నర—ఆహాహా! ఆయిల్లాలు మెచ్చుకొనుట కీమగఁ డామెప్పు నంగీకరించుటకు సరిపోయినది. ఓరోరి చంద్రవంశకళంక! నీవా నాదుర్మద మడంచువాఁడవు.

చ. అణఁచితి గాదె మాగధుబృహద్రథనందనుద ంబుచే
వణఁచితి గాదె కాలయవనాదిబలాఢ్యుల విక్రమించి నీ
వణఁచినవారె ముజ్జగములందు గణించినశూరు లెల్ల హా
వణఁ కుదయించె దిక్కఁవ రపాయము వాటిలె నేమి సేయుదున్. 28.

కృష్ణ—కాల మాసన్న మయినది. తొందరపడకుము.

మ. తులువా! నీతలఁ దన్నినట్టిఘనదైత్యుల్ చండదుర్వారదో
ర్బలసంక్షోభితశత్రుభూధరచమూరత్నాకరుల్ వ్రేల్మిడిన్
శలభంబుల్బలె ప్రగ్గినారు సుమి మచ్చక్రాగ్ని నీ వెంత ప్ర
క్కలు గావించెద మస్తకం బిపుడె నీగర్వంబుఁ గ్రక్కించెదన్. 29.

ఉ. ఏటికి నీచుతోడ నిపు డీగతి నున్నను బుద్ధి రాదె యే
నాటికినైన నంచును మనంబున ని న్గణియింపకున్న నా
నాఁటికిఁ బిచ్చలించె భువనంబులు నీపెనుదుండగంబులన్
నేఁటికిఁ బండఁబాఱినది నీదురితంబు నిమేష ముండురా! 30.

నర—నీవు న న్నశక్తదుర్జనత్వముచే సైరించుచున్నాఁడవుగాని చెల్లుబడికలిగి కాదు. మే మన్ననో ని న్నొక్కత్రుటిలో నిగ్రహింపఁగలము.

చ. మగఁటిమిలేని యీపనికిమాలినభీరువుతోడ నేటికిం
బగ యని యెంచి నీపలుకుఁ బాడిగ నెంచక నిన్న ద్వారకా
నగరమునుండి యెన్నియొదినంబులక్రిందట సాగఁదోల కీ
పగిదిని పీడఁగాఁ బొగరువట్టితి గ్రొ వ్వడగింతు నుండురా! 31.

నీచక్రాగ్ని న నేకదనుజులు భ్రమ్మిరా?

శా. ఏడీ వ్రేలుమడంచి చెప్పు మని నీ వేపీరు న్యాయంబుగా
నోడం బుచ్చితొ హంసు నాడిబికునా యోగ్యుం జరాసంధు నా
పాడిం దప్పియె పిల్కు మార్చితివి యాభవ్యాత్ములం జాలు నీ
యేడాగోడపుఁబల్కు లేల నిలు ని న్నేడాట లాడించెదన్. 32.

నీ కొక దానిలోమాత్రము విశేషప్రజ్ఞ యున్నది.

శా. పోరాటంబులు బెట్టి యెండొరులకుం భూపాలకశ్రేణిలోఁ
జేరందీయుదు నందు నొక్కని బరుం జెండాడి యెట్టెట్లో భూ
భారం బంతయు బాపినాఁడ నిది నాప్రజ్ఞాబలం బంచు నూ
రూరం బల్లరుఁ జాటఁ బంచెదవుగా యోహూ యనన్ భూజనుల్. 33.

అన్నిటి కేమిగాని నన్ను మాటిమాటికిఁ బాపాత్ముఁడ నని పలుకుచుంటివి. దానశీలుఁడ నయి బహుక్రతుఁడనయి వేదవేదాంగవిదుఁడనయి మహేశ్వరచరణారవిందధ్యానైక చిత్తుఁడ నయిన నేను నీకన్న నెక్కుడుపాపంబు లే వొనర్చితినో యొక్కసారి సెలవిమ్ము.

కృష్ణ—ఓమూర్ఖుఁడా!

శా. వేదంబుల్ తలక్రిందుగా జదువనీ విప్రాళి కర్పింప నీ
భూదానాదులు; చేయనీ శతమఖంబుల్ భక్తి వర్ణింప నీ
వేదాంతార్థము; ముక్తి నొందఁడు సుమీ పృథ్విన్ దయాసత్యశౌ
చాదుల్ దవ్వగ ద్రోలుచుం దిరుగు మోహాంధుండు దైత్యాధమా. 34.

నీపాపంబులు నీ వెఱుఁగవా? నీయంతరాత్మ నిన్నుఁ బీడించుట లేదా?

మ. మునులం జంపితి జన్న పుంబసువులన్ ముచ్చిల్లి తంతఃపురాం
గనలం బల్మినిబట్టి తెచ్చితివి స్వర్గంబెల్లఁ జూఱాడితె
న్నని వర్ణింతును జెప్పవచ్చును మితం బైనన్ మహీ స్నీవు చే
యని దోసంబులు చెందరానిగతు లెం దైనం గనన్ వచ్చునే. 35.

నర—(నవ్వుచు) ఓరోరియదువంశజలధిబడబానల! ఈదోసంబులు కొన్ని నా యందు కాదు నీయందునుం బొడఁగట్టుచున్నవి సుమా!

మత్తకోకిల. చేసినాఁడవు స్త్రీవధంబును జిన్ననాఁటను గూళవై
చేసినాఁడవు గోవధంబును జేడె, నీల నిమిత్తమై
తీసినాఁడవు మామప్రాణము దిక్కులేని యవస్థనీ
చేసియుండని దోస మున్నదె సిగ్గుమాలిన ప్రేలరీ! 36.

అది యటుండనిచ్చి నే నొక్కటి యడిగెదను. దానికుత్తర మిమ్ము.

క. శిశుపాలుఁడు మఱఁది గదా
శిశుపాలుఁడు వలచినట్టి చేడియ నీకున్
విశదముగఁ జెల్లెలే గద
పశువా యేమనుచు దానిఁ బట్టితి చెపుమా? 37.

దోసంబు లన్నియు నీయందె యుంచుకొని మీఁదుమిక్కిలి మమ్ముం గలుపాత్ము లనియెదవా? శాత్రవదుర్నిరీక్షవిక్రమక్రీడారంభులమయి తేజోహీనుఁ డగుబిడౌజుని దిక్పాలకసమేతముగ నోడిచిపుచ్చి జగత్త్రయం బాక్రమించుట నేర మగువా? ఇది క్షాత్రము గాదా? పాలుబోతు వగు నీకు క్షాత్ర మేమి తెలియును.

కృష్ణ—రాక్షసాధమా! క్షాత్ర మనుసరింపఁ దలఁచినచో నీవు త్రివిష్టపముపై దండెత్తవచ్చు. సహజవైరి యగుమహేంద్రు నెదిరించి గెలువవచ్చు; కాని—

మ. నిను నిందించిరె నీపయిం గనలిరే నీజోలికిన్ వచ్చిరే
మనుచుంగానల ముక్కు మూసికొని బ్రహ్మధ్యానముం జేయుస
న్మునులం గొట్టితి వేమి చేసిరి మహాత్ముల్వార లాలోకపా
వనులం జంపుటయా పరాక్రమము నాపైఁ జూపు నీతేజమున్. 38.

సీ. క్షుద్రాత్మునకు నీకు జోహారు లొనరింప బలహీనుఁ డగువజ్రపాణి గాఁడు
నీదళంబులఁ జూచి నిర్విణ్ణులై పాఱ ముకు మూసికొను వెఱ్ఱిమునులు గారు
నీవిగ్రహముఁ జూచి నిశ్చేష్టలగుటకు ననదలౌ రాజకన్యకలు గారు
నీవిభీషికలచే నివ్వెరపడుటకు నధికఛాందసులు బ్రాహ్మణులు గారు

ఎవ్వఁడుగఁ దలంచితివో యీవెదను నన్ను
సకలభూతభయంకరజన్వరంగ
ఖండితానేకదైతేయకంఠనికర
దేవతాచక్రవర్తిగాఁ దెలిసికొనుము. 39.

నర—ఓకోరియీశ్వరమ్మన్య! నీవు భగవంతుఁడ వని యీవఱకు నీభార్య సత్య భామ వచియించినది. ఇప్పుడు నీనోట నేవినుచున్నాఁడను. ఇట్లుఁ దలంచుట నీనేరము గాదు. చదువులు నేర్చిన దుష్పండితులు కొందఱు జగద్వంచనము చేయఁదలఁచి—

సీ. కటిమొద్దువోలు నీకాయపుంజాయలు కారుమబ్బులకు సంగడము లనిరి
నీక్రుచ్చుఁదనములు నీఱంకుకతలు నీలేకిపనులు విష్ణులీల లనిరి
నీవంచకత్వంబు నీగుట్టు వెలిఁబుచ్చు ధర్మాత్ము లనుదుష్టదైత్యు లనిరి
నీకు గులాము లై నిరతంబు గొనియాడు తెలివిమాలినవాండ్ర దివ్యు లనిరి
అన్నిగుణములయందు నీ కన్న యైన
త్రాఁగుఁబోతును శేషావతారుఁ డనిరి
ఒక్కపూఁటకు గతిలేని బక్కవాని
విశ్వమయుఁ డగు నమ్మహావిష్ణు వనిరి. 40.

నేను నారాయణుఁడ నని నీలో నీవెంత మురిసినను మునిముచ్చులు నిన్నెంతగఁ గొని యాడినను నీ వచ్యుతుఁడవు గావు. నక్క పార్వతి యగు నేని కప్ప నారాయణుఁ డగు నేని నీవు హరివగుదువు. నాయెఱింగినంతవఱకు.

శా. నీకన్నం గనుదుష్టకష్టమతియు న్నీకన్నఁ బాపాత్ముఁడున్
నీకన్నం గఠినాత్ముఁడుం గుజనుఁడు న్నీకన్న దుర్మార్గుఁడున్
నీకన్నం బలుకాకియుం జెనఁటియు న్నీకన్న దుశ్శీలుఁడున్
నీకన్నం జడుఁడుం గనంబడఁ డిల న్నిర్భాగ్యదామోదరా! 41.

వలువురనో ముప్పురనో బక్కరక్కసుల దొంగపోటుగఁ జంపి దనుజాంతకుఁ డను నలీకపౌరుషనామము ధరించి బెదరింపఁజూచ్చెదవా? ఒకవేళ నీ వనుకొన్నట్టు భగ వంతుఁడవే యగుదువు గాక!

క. భగవంతుఁడవే యైనను
భగవంతుని తాతవైన భయపడఁ జుమ్మీ
తెగటార్చెద పగఁ దీర్చెద
మగవాఁడవయేని నిలిచి మార్కొను నన్నున్. 42

సత్య—(మెల్లఁగా) ప్రాణేశ్వరా? ఎంతసేపిటఁ దొడలుమఱచి ప్రేలుట.

కృష్ణ—సుందరీ! ఈతనిప్రల్లదంబు లిప్పుడే తుదముట్టఁగలవు. ఓరోరి దైత్యాధమా! అవ్యవస్థితము లగునీదుర్భాషణంబులకుఁ బ్రత్యుత్తరంబు లొసంగ నక్కఱలేదు. ఏమంటివేని.

మ. చకితబ్రాహ్మణగోవధూనికరముల్ సమ్మోదముం బొంద వై
దికధర్మంబులు సాగ నెప్పటి యటుల్; దివ్యుల్ ప్రహర్షింపఁగా
సకిరీటంబు సకుండలంబు సశిరస్త్రాణంబుగా నీదు మ
స్తకముం ధారుణిఁ గూల్చువాఁడ నిదె మచ్చక్రాహతిన్ దుర్మతీ! 43.

దేవీ! చక్ర మిటు దెమ్ము.

నర—ఓరోరి క్షత్రియకులాపశదా! ఏమి! సకిరీటంబు సకుండలంబు సశిరస్త్రాణంబుగా నాదు మస్తకమును గూల్చెదవా?

సీ. జవరాండ్రతోఁ గూడి సరసమాడుట గాదు మరలించుటకు నాలమంద గాదు
జున్నుమీఁగడ వెన్న జుఱ్ఱుకొనుట గాదు పడఁదన్నుటకుఁ జిన్నబండి గాదు
పాలీయవచ్చినపడఁతిఁ జంపుటగాదు చిదుకఁద్రొక్కఁగ నీటిచిలువగాదు
మతిలేకయుండినమామఁ గూల్చుటగాదు పెల్లగురుటకు వ్రేపల్లెగాదు
మాజరాసంధునకు నోడి మధుర విడిచి
నట్టనడిసముద్రంబున నగరు గట్టి
కాపురం బున్నజెట్టివి గావె నీవు
నన్నుఁ గూల్చువాఁడవు నీవె నందతనయ. 44.

నీవు చక్రంబును ధరింపుచున్నాఁడవు గావున నే నిదె వింట బ్రహ్మాస్త్రముఁ దొడుగుచున్నాఁడను.

క. మొక్కలము లేల పలికెదు
పెక్కులు; నరకాసురుండు విడువఁడు నిను నీ
వొక్కమ్మకు నొక్కయ్యకు
నిక్కముగా పుట్టితేని నిలుమీ యెదుటన్. 45.

సూతుఁడా! రథము గోపాలున కభిముఖముగాఁ ద్రిప్పుము.

సూతు—దేవా! అట్లే చేయుచున్నాఁడను.

కృష్ణ—దారకా! రథము దానవున కభిముఖముగాఁ ద్రిప్పుము.

దార—ఆయుష్మంతుఁడా! అరదము వాని కభిముఖముగానే యున్నది.

[తెరలో]

నరకమహారాజా శరణు! శరణు! ఈగరుత్మంతుఁడు మమ్ముం బ్రతుకనిచ్చుట లేదు. కుటిలనఖరాగ్రమ్ముల నెత్తురుకండలఁ బెకలించియుఁ జంచుపుటంబున మేనులఁ జీల్చియుఁ

బక్షోఘాతంబులం దూల్చియు నితఁడు దానవసైన్యంబుల దైన్యంబు నొందించుచున్న వాఁడు. రక్షింపుము. రక్షింపుము.

నర—ఓదనుజులారా! వెఱవకుఁడు. వెఱవకుఁడు. ఇదిగో వచ్చుచున్నాఁడ. సూతుఁడా! రథము తోలుము.

సూతు—ఇదిగోఁ దోలుచున్నాఁడను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

దార—దేవా! ఈదురాత్ముఁ డీసెపము పెట్టి తప్పించుకొని పోయినాఁడు.

కృష్ణ—వాఁడు పలాయితుఁ డయినను మనము వానిని విడుతుమా.

దార—వీఁడు కర్ణకఠోరముగా నొనరించిన భగవద్దూషణమునకు తక్షణమే వధ్యుఁడు.

సత్య—దారకా! భగవంతుని తెలిసికొనుట కెంతవారు గావలయును.

శా. శ్రీరంజిల్లఁగ ముక్తినామక మహాసీమంతినిం గూడి యోం
కారస్యందన మెక్కి స్వేచ్ఛ మయి విజ్ఞానాత్మకం బైన గరి
భీరాకారముతోడ నయ్యుపనిషద్వీథి న్నిరాఘాటసం
చారంబుం బొనరించు నీశు నెఱుఁగన్ శక్యంబె దైత్యాళికిన్ ? 46.

దార—అమ్మా! నీమాట నిజము. ఈశ్వరు నెఱుఁగుటకు వీ డెంతవాఁడు.

కృష్ణ—దారకా! నరకునిమీఁది కరథమును సత్వరము తోలుము. ఇప్పుడే వానిని చక్రంబున కెరఁ జేసెద.

దార—చిత్తము. (అని తోలుచున్నాఁడు.)

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీ

# ప్రసన్నయాదవనాటకము.

## పంచమాంకము.

[అప్పు డేడ్చుచు వజ్రకంఠుఁ డనురాక్షసుఁడు ప్రవేశించును.]

వజ్ర—(తనలో) హా నరకమహారాజా! హాశ్రితజనకల్పద్రుమా! హా దనుజకులపారిజాతమా! హా సుగుణరత్నాకర! దురాత్ముఁడయినకృష్ణునిచే నిష్కారణముగా వధియింపఁబడితివా? అయ్యయ్యో! ఇంక మాకు దిక్కెవ్వరు? నీయండ నుండబట్టియేగదా దిక్పాలకులను స్వర్గమునుండి దొంగలను దోలినట్లు తోలి కంటి కగపడిన దేవతల నందఱను జేతికిదొరకిన బడితెలతోఁ గుక్కలను కొట్టినట్లు కొట్టఁగలిగితిమి. నీసంరక్షణమున నుండఁబట్టియే గదా మేము గాదిక్రింది పందికొక్కులవలె నేవెలితియు లేక హాయిగా సుఖించితిమి. నీపేరు దివ్యులకు సింహస్వప్నముగదా! ఆ మేలుదినములు పోయినవి. మందభాగ్యుల మగుమాకు నీవంటి యుత్తమోత్తముఁడు దొరకునా? ఇవి న్యాయమునకు దినములుగావు. అందుచేతనే స్వకులాభిమానులును ధర్మస్వరూపులును తేజోరాసులును నగుమీవంటివారు కడునీచులచేత మడియుటయు దుర్జనులును దుర్మార్గులును దుశ్శీలురు నగువేల్పులు జయించుటయు సంభవించుచున్నది. లోకములో నెందఱికైనను చావున్నది; కాని యీపాడుముండకొడుకు కృష్ణునకుఁ జావులేదుగదా. మారక్కసుల నందఱఁ జంపి వాఁడు వారి యాయువుఁ బోసికొని చిరంజీవియై బ్రతుకుచున్నాఁడు. పాపీ చిరాయు వన్నమాట వీనియందే సార్థక మగుచున్నది. ఈపాపాత్మునకుఁ బురిటిలో సంధైనంగొట్టదయ్యె. పాలపాపచిన్నెయైన రాదయ్యె. ఏరక్కసుని చేతంబడియైనఁ జావడయ్యె. ఏరోగములేక నాచిన్నప్పటినుండియు నీకృష్ణుఁడు రాయివలె నిల్లేయున్నాఁడు. ఎంతో ధైర్యవంతుఁడను నేనే యింతబెంగఁ గొనఁగా జేల లగుమంపపాలుఁడు లోనగువా రెంత కడుపగిలి యున్నవారో కదా!

[అంతట పెద్దపెట్టున నేడ్చుచు మందపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మంద—(తనలో) హా! రాక్షసరాజా! నీకెంతలోఁ గాలమాసన్నమైనది. నీవు లేక పోవుటచేఁ బాపాత్ము లగుమునులు దేవతలుఁ జెలరేఁగి మాకొంపలు త్రవ్వెదురు గదా! ఇఁక మాకవ్వరు దిక్కు. నే నేమి చేయుదును? చిన్నతనమునుండియు నన్నదమ్ముల లాగున బెరిఁగితిమి గనుక నేనును మావజ్రకంఠుఁడును గలసి యేదో బ్రతుకుతెరు వాలోచించుకొనియెదము. ఇదిగో వాఁడిచ్చటనే యున్నాఁడు. (అని సమీపించును.)

వజ్ర—(ఏడ్చుచు మందపాలునిఁ గౌఁగిలించుకొని) మనమహారాజుగారిని కృష్ణుఁడు తనపొట్టను పెట్టుకొన్నాఁడురా! అన్నయ్యా!

మంద—మన మిప్పుడు దిక్కుమాలినవార మైనాముగా! తమ్ముఁడా!

వజ్ర— ఎల్లప్పుడు నా పాదుపేల్పులపంతమే నెగ్గుచున్నదిరా! అన్నయ్యా!

మంద—మననోట శనియుండఁగా మనపంత మెట్లు నెగ్గునురా! తమ్ముఁడా!

వజ్ర—మనుష్యులనెత్తురు గావలసినంత పానకము ద్రావినట్లు గుటగుటత్రాగెడు వారముగదా! అన్నయ్యా!

మంద—మొక్కజొన్నపొత్తులవలె నిర్భయముగాఁ గావలసినప్పుడు మనుష్యులను గాల్చుకు తినెడువారము గదా! తమ్ముఁడా!

వజ్ర—ఆవైభవమే పోయిందిరా! అన్నయ్యా!

మంద—అప్పుడే పట్టణమంతా పాడుబారిందిరా! తమ్ముఁడా!

వజ్ర—ఇంతపని చేసినకృష్ణునిఁ గడతేర్చుటకు నుపాయ మాలోచింపవలయును.

మంద—బుద్ధిమంతులము మన మిద్దఱముఁ దలఁచుకొన్నపక్షమున వాఁ డింక బ్రతుకఁగలఁడా?

వజ్ర—అట్లయిన కృష్ణు నేవిధమున మృతినొందింతము?

మంద—నీవు త్రాఁచుపామువై వానిని గరువుము.

వజ్ర—వెంటనే గరుత్మంతుఁడు నన్నుఁ జీల్చి చంపఁగలఁడు.

మంద—అవునవును. అది వీలులేదు; పోనీ పులివై వానిఁ గడతేర్పుము.

వజ్ర—అతఁడు నరసింహమూర్తి. అందుచేత నతఁడు పులిమీఁద పుట్ట.

మంద— నిజము నిజము అది వలనుపడదు. పోనీ కొండవై నేను వానిమీఁదఁ బడుదునా?

వజ్ర—వాఁడు కొండ గుండఁ జేయఁగలబండ. గోవర్ధన మెత్తలేదా?

మంద—నిశ్చయమే. ఈయుపాయములు బాగులేవు. ఈదొంగపోటులేల? కత్తి చేతఁబూని శూరులమై వాని కెదురుగఁ బోయి వధియింతము. మృతినొందుదు మనుభయ ములేదు. గ్రుక్కెడుప్రాణము. ఎప్పుడు పోయినను పోవును.

వజ్ర—అవు నవును. మహారాజుగారే మృతినొందఁగా మన మెంతవారము. ఈ తుచ్ఛప్రాణములపై నాశ విడిచి స్వామిభక్తిని జూపుదము. రమ్ము కత్తులఁ దెచ్చు కొందము.

మంద—ఉండు. ఉండు. ఎవరో వచ్చుచున్నారు.

వజ్ర—(చూచి) హా! చచ్చితిని. వాఁడు కృష్ణుని సారథి యగుదారకుఁడు.

(అంతట దారకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దార—(తనలో) భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు నన్నుం బిల్చి, దారకా! పితృవిహీనుఁ డగుభగదత్తకుమారుని నే నిప్పుడ చూడవలయు. వానికి నారాఁక నెఱిఁగింపు మని యానతిచ్చె. అతఁ డెందున్నవాఁడో తెలిసికొని యిప్పుడే సందేశ మెఱిఁగించెద.

మంద—ఓరీ! వజ్రకంఠా! మన మిప్పుడు పాటిపోయినను వీఁడు చంపును. పాటిపోక నిల్చినను వీఁడు చంపును. గతి యేమి?

వజ్ర—వానిమాట కెదు రాడకపోయినచో వాఁడు మనలఁ జంపఁడు.

దార—ఓయి! మీ రెవరు? కుమారభగదత్తుఁ డెందున్నవాఁడు.

మంద—(గజగజవడఁకుచు) మేము నర నర నర నర.

వజ్ర—(గద్గదస్వరముతో) మేము నరకుని బంట్లము కాము.

దార—మీ రింత భయపడ నక్కఱలేదు. నేను మీజోలికి రాను. భగదత్తుని జూడఁ దెల్పుఁడు.

వజ్ర—అయ్యా! నరకాసురుఁడు పరమదుర్మార్గుఁడు. కడునీచుఁడు. నీతివిహీనుఁడు నగుటచే మే మతని సేవించుటలేదు.

మంద—అయ్యా! భగవంతుఁడగు శ్రీకృష్ణునకు నరకుఁడు విరోధి యగుటచే వాని సేవించుట మానితిమి.

దార—(తనలో) ఈపిరికిముండకొడుకులు నాకు వెఱచి యి ట్లనుచున్నారు. (ప్రకాశముగా) రాక్షసులకు సయితము నంతటి యసహ్యము గలిగించు దుర్గుణము లతని యొద్ద యేవియున్నవి.

వజ్ర—ఒకటా రెండా చెప్పనలవిగాదు. స్త్రీలఁ జెరబెట్టుట, మహర్షుల బాధించుట, యాగములకు విఘ్నములు సేయుట, విష్ణుభక్తులను వధించుట మొదలగు పాతకముల ననేకములు చేసెను.

మంద—ఆపాతకుని పేరు మఱి మిక్కుడ తలపెట్టరాదు. కృష్ణుఁడు వానిం జంపి లోకమునకు మేలు చేసెను. వాఁడు తప్పక చావవలసిన వాఁడే.

దార—మీప్రసంగములు చాలించి భగదత్తునిజాడ నెఱుఁగుదు రేని చెప్పుఁడు. లేనిచో మీదారిని మీరు పొండు.

వజ్ర—స్వామి! మా కాజాడ తెలియదు. మాకు సెలవొసంగుఁడు. పోవుదుము. రారా! మందపాల ! (అని యిద్దఱు కొంచెము నడచి రహస్యముగా) గండము గడచి యివతల పడితిమి. త్వరగా పసగెత్తుకపోవుదము. రమ్ము. (అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

దార—(తనలో) నా కిప్పుడు భగదత్తునిజాడఁ దెలుపువా రెవ్వరు? అదిగో నక్కడ యొకకంచుకి యగపడుచున్నాఁడు వాని నడిగెద. (ప్రకాశముగా) ఓయీ ! భగదత్తకుమారుఁ డెందున్నవాఁడో యెఱుఁగుదువా?

[తెరలో]

అయ్యో! అతఁడు దుఃఖపరవశుఁడై తండ్రికళేబరమును జూడఁగోరి పొలికలనికిం బోవనుద్యుక్తుఁడై యున్నాఁడు.

దార—(ఆలకించి) సరే! నేనిప్పు డతనియొద్దకుఁ బోయి సందేశ మెఱిఁగింప నక్కరలేదు. వాసుదేవుఁడే వానిని యుద్ధభూమిలోఁ గలసికొనఁ గలఁడు. (అని నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

[అప్పుడు యుద్ధభూమిలో మూర్ఛితుఁడైనభగదత్తుఁడును శంబర మంత్రియుఁ బ్రవేశించుచున్నారు.]

శంబ—(తనలో) పితృవియోగదుఃఖము దుస్సహమైనదే. ఈభగదత్తుఁడు తండ్రికళేబరము నొక్కసారి చూచి మూర్ఛితుఁడై యింకను స్మృతినొందకున్నాఁడు. దైవానుగ్రహమున వీనికి మరలఁ దెలివి వచ్చునేని వీనిని దండ్రికళేబరమువద్దకు మరలఁ బోనీయఁగూడదు.

తే. గీ. భూరిసంతాప మెదఁ బొంగి పొరలునపుడు
చల్లఁదనమును వెదచల్లుసంగడీల
యూరడింపుబలుక్కులుపాచు నుమ్మలంబు
పాలపొంగును చన్నీరు పాపునట్లు. 1.

భగద—(మూర్ఛనుండి లేచి) హా! తండ్రీ! జగత్రయైకవీరా! తృణీకృతపురందరాదిదిక్పాలకా !

ఉ. తోలితి వాలమందలను దోలినపోలిక వేల్పుమూఁక ది
క్పాలురద్వారపాలకులుగా నొనరించితి కోటకొమ్మలన్
వ్రేలఁగఁ గట్టినాఁడ వరివీరశిరంబుల నట్టినీవు గో
పాలునిపాలు గావలసి వచ్చెనె యీశ్వరమాయ నక్కటా! 2.

క. తలిదండ్రులకుం దమతన
యులపై గలయంతకూర్మి యుండదు తలిదం
డ్రులపై బిడ్డల కనియెడి
పలు కిప్పుడు నాకు నిక్కువంబై తోఁచున్. 3.

అందుచేత నేగదా నేను నిన్ననుసరింపలేకపోతిని.

శంబర—(సమీపించి) కుమారా! ఊరడిల్లు మూరడిల్లుము.

భగద—అయ్యా! శంబరమంత్రీ! ఇది నేను స్వయముగాఁ దెచ్చుకొనినది కాదు. అందుచేత నేనడపఁజాల. అయిన నిటు విను.

సీ. ఎవనిమెప్పును బొంద నేవేళ పవనుండు వెచ్చనిగాడ్పులు వీవ వెఱచు
నెవనియల్కకు నోడి యెన్నండు భానుండు గట్టిగా నెండలు గాయ వెఱచు
నెవనియానతిలేక యెపు డుపర్జన్యుండు గొప్పగా వానలు గురియ వెఱచు
నెవనిదాడికి నోడి యేప్రొద్దు మధువైరి కుదురుగా కనుమూసి కునుక వెఱచు
నెవనిపే ర్విన్నమాత్రాన ధృతిఁ దొలంగి
దిగ్గజంబులు స్వేచ్ఛమై తిరుగ వెఱచు
నట్టిజగదేకవీరుఁ బోఁగొట్టుకొంటి
నింక నూరట గల్గుట యెట్లు నాకు. 4.

శంబర—నీతండ్రి నిజముగా నీ వన్నట్లు నిరుపమానతేజోరాశి. విచారించిన కార్యము లేదని నే నిట్లు నీ కుపదేశించితినిగాని నీకుఁ గలదుఃఖము నే నెఱుఁగనా? సేవకుల మయిన మేమే యెంతో మఱుఁగుచుండఁగా గారాపుకొడుకు వయిననీ వెంత దురపిల్లుచుందువో చెప్పవలయునా? కావున నిప్పుడు కార్యగతులఁ బరిశీలించి వర్తింపుము.

భగద—అయ్యా! ఈసమయమునందు.

తే. గీ. ధైర్యశాలి కున్నవి రెండుకార్యగతులు
జనకుఁ దెగటార్చుపగతునిఁ జంపుటొండె
సమరముఖమునఁ దా నైనఁ జచ్చుటొండె
కానఁబడ దింక నాకన్య కార్యసరణి. 3.

శంబర—కుమారా! అది గాదు. తండ్రి కగ్నిసంస్కారంబు చేసి యుత్తర క్రియలం జేయుటయే కార్యపద్ధతి.

భగద—హా తండ్రీ! భువనైకమల్లా! నీవిషయమయి యెట్టిదారుణవచనంబులు వినవలసె.

మ. అపచారం బొనరింప నెన్నఁడును నే నాబాల్యము న్నీకు నే
యుపచారంబును నీవు నావలన ము న్నొక్కప్పుడుం గోరవై
తిపు డీరీతిని గోరఁగాఁ దగునె తండ్రీ యగ్నిసంస్కార మే
యుపచారం బగువేళ వచ్చినదె యయ్యో నాదునిర్భాగ్యతన్. 6.

శంబర—కుమారా! ఏమి యీ బేలతనము! (తనలో) ఈతఁడు మాటిమాటికి మూర్ఛిల్లుచున్నాఁడు. ఇతనికి దుఃఖోపశమన మెట్లగును చెపుమా! శుక్రశిష్యుల కెంత దురవస్థ సంభవించినది.

[అప్పుడు రాక్షసగురు వగుశుక్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శుక్రు—(తనలో) అసురులు వేల్పులకన్న నెక్కుడు తేజోదర్పితు లయినను వారి యైశ్వర్యము వినశ్వర మగుటకుఁ గారణ మేమి? (కొంచె మాలోచించి) కారణమున కయి వెదుక నక్కరలేదు.

మ. సిరి యెల్లప్పుడు ధర్మమూల మనుచుం జెప్పన్ విధుల్ ధర్మత
త్పరుఁడౌ నాతనిభూరివైభవము నిత్యంబై ప్రవర్ధిల్లు దు
ష్కరుఁడై ధర్మము వీడు మానవు మహైశ్వర్యంబు లీభూమికిం
బరువై గట్టి పునాది లేనియిలు లేవం గూలు నొక్కుమ్మడిన్. 7.

దానవులు ధర్మేతరమార్గవర్తను లగుటచే వారికడ సిరి యుండదు. ఎట్లయినను వారు మాకుఁ బ్రియశిష్యు లవుటచే వాత్సల్యంబు పెంపున మేము వారిని సమాదరింపక తప్పదు. పితృవియోగదుఃఖితుఁ డగుభగదత్తకుమారుని నమాశ్వాసింపవలయు.

భగద—(స్మృతి దెచ్చుకొని) తండ్రీ! నీవు లేమి జగమంతయు నంధకారమయమయి యున్నయది. ఏలయన

తే. గీ. పృథివి యంతయు నేఁడు నిర్వీర మయ్యె
రాజకుల మెల్ల నేఁడు నిస్తేజ మయ్యె
దితిజవంశంబు నేఁడు నిర్గతిక మయ్యె
నీవు లేనివెలితి ధాత్రి కెట్లు దీరు? 8.

శంబర—కుమారా! ఇదే నీనిమిత్తము భగవాను లగుభార్గవులు వచ్చియున్నారు. అభివాదము చేసి సదాచారము నడుపుము.

శుక్ర—కుమారా! ఊరడిల్లు మూరడిల్లుము.

భగద—(కన్నీళ్ళతో) భార్గవా!

మ. కదనోద్ధూతబిడౌజుఁ డాసురవధూకళ్యాణసంపాదియు
న్మదరాజన్యశిరోవతంసవిలసత్పాదారవిందుండు కో
విదుఁ డస్మజ్జనకుండు మీహితుఁడు మీభక్తుండు మీశిష్యుఁ డ
ల్లదె నేలంబడి యున్నవాఁడు హతుఁడై యాచార్య కన్గొంటివే? 9.

శుక్ర—వత్సా! మృతు లయినవారిని మనము దుఃఖించి క్రమ్మర బ్రతికింపఁ జాలము. చిరసంబంధముచే నెంత యూఁచుకొన్నను దుఃఖాతిశయముచేత నేనును కన్నీరు విడువక తప్పినదికాదు. తలఁచుకొనినకొలఁది దుఃఖము పొరలిపొరలి వచ్చుచునే యుండును; కావున నీ వింక నీతండ్రిని మఱవవలయు.

భగద—అయ్యా! వేదాంతవిద్యారహస్యజ్ఞాతు లగుమీరే దుఃఖమున కప్పుడప్పుడు వశు లగుచుండ నింక మాదృశులా దుఃఖసాగరము నీదువారు!

చ. మఱవఁదలంతు నాయెడల మజ్జనకుం డొనరించుగారమున్
మఱవఁదలంతు వానియసమానగుణంబుల నెల్లఁగాని యా
నెఱతన మాజగద్వినుత నిష్ఠురవిక్రమ మానుమూర్తియున్
మఱవఁదలంచినన్ మఱవ నాతరమా నిమిషార్ధమేనియున్. 10.

శుక్ర—ధైర్యసాగరుఁ డగునరకునకుఁ దనయుఁడ వయిననీ వి ట్లనఁ దగదు.

భగద—అయ్యా! ఇప్పు డేమి చూచుకొని నేను బ్రతుకుదును?

శుక్ర—కుమారా! ఏమియు లేనేలేదా?

తే. గీ. తల్లి గలదు రాజ్యరమాతల్లి గలదు
ప్రజలు గలరు నీకును గన్నప్రజలు గలరు
బాలుఁడవు నీవు నీ కేమి బ్రతుక కేమి?
చన్నవారితోఁ బోదురే యున్నవారు. 11.

భగద—అవి యుండుట నే నెఱుంగుదును.

ఉ. ఉన్నవి వాజివారణము లున్నవి సంపద లెన్నియేని నా
కున్నవి నందనోపమమహోపవనంబులు పెక్కు లేలగా
నున్నవి యూళు లెన్నయిన నున్నవి సైన్యము లెన్ని యున్న నే
మన్నరకుండు లేమి నవి యన్నియు లేనటు తోఁచు భార్గవా! 12.

శుక్ర—వత్సా! అ ట్లయిన నీయుద్యమ మేమి?

భగద—వీరపురుషులయుద్యమమే నాయుద్యమము.

శంబ—ఈయుద్యమ మనుచిత మయినది.

శుక్ర—ఏమి? నీవు హరితోఁ గయ్యమునకు సన్నద్ధుఁడ వయ్యెదవా?

భగద—ఆచార్య! మఱేమి.

ఉ. అంతటివానికిం గొడుకునై ప్రియశిష్యుఁడనై ధరిత్రి మీ
యంతటివానికిన్ ప్రభువునై దితిసంతతి కెల్ల నిన్నినా
ళ్ళింతయశంబుతో నడరి యీసమయంబున బంద నౌచు నే
నంతము సేయకుండ తగవా నరకాంతకు నమ్మురాంతకున్. 13.

శుక్ర—ఓయీ! వెఱ్ఱివాఁడా! నీతండ్రికిని నీతండ్రిందలఁ దన్నిన మొక్కలంపు రక్కసులకును నలవిగాని యీపని నీకు సాధ్యమగునా?

క. ఏమనుకొంటివొ నీమది
సామాన్యుఁడు గాఁడు చక్రి సమరంబున నీ
చే మర్దింపంబడుటకు
నామాటలు వినుము సంధి నడుపుము వత్సా! 14.

శంబర—(శుక్రునితో మెల్లఁగా) దేవా! ఈయుద్యమ మెట్లయిన మాన్పి దనుజకుల మనుగ్రహింపుము.

శుక్ర—కుమారా! కృష్ణునిప్రభావము వినఁగోరుదువేని నే నించుక ప్రశంసించెద వినుము. అతఁడు మహీభారావతరణార్థమై యదుకులంబున నవతరించినహరిగాని మనుజుఁడు గాఁడు. అందుచే నతఁడు.

సీ. పసితనంబున నేల ప్రాఁక నేర్చిననాఁడె పగరకోటల కెగఁబ్రాఁక నేర్చె
తిన్నఁగా నొక్కవిద్దెమును నేరనినాఁడె దితిజులఁ జంపువిద్దెమును నేర్చె
నిలతప్పటడుగులు నిడుట నేరకమున్నె వెసతప్పటడుగులు వెట్ట నేర్చె
నుయ్యాలలం దుండి యుగ్గుత్రాగెడునాఁడె కిగ్గాడి యసురుల నుగ్గు చేసె
పాలు గుడుచునప్పుడె నేలపాలు చేసె.
ప్రబలదైత్యులఁ బలువురబలము మెరయ
నతఁడు మాపినకులము లెన్నైనఁ గలవు
వలదువలదన్న హరితోడఁ బగలు మనకు. 15.

వెండియు నితఁడు మాయలఁ బ్రయోగించుటయందు నెరకాఁడు.

శంబర—అవును. వైష్ణవం బైనమాయ దుస్తర మని వినుచుందుము.

భగద—పగతుర సాధించుటకు కితఁడు మాయలనే ప్రయోగించునా?

శుక్ర—వత్సా! మఱేమి? చూడు.

మ. కడపెన్ గంసుని చంపె హంసునిద్రుటిం గెల్చెన్ జరాసంధునిన్
బొడిచెన్ బౌండ్రకుఁ గూల్చె కాలయవనున్ బోకార్చెఁ జేదీశు జ
క్కడచెన్ బూతనవీరి నందఱను మాయల్ వన్నియే చక్రిరూ
పడచెన్ గాని పరాక్రమస్ఫురణచే నంతంబు నొందించెనే. 16.

అవి యన్నియు నేల? నాస్వవిషయమున నే నించుక చెప్పెద వినుము. తొల్లి యతఁడు మహేంద్రరక్షణము చేయ నదితికశ్యపులకు వామనుఁ డయి జయించి దీనచింతామణి యగుబలిచక్రవర్తియొద్దకు నిరుపేదయట్లు వచ్చి మూ డడుగులనేల యాచించె. అప్పుడు నేను

ఉ. కైటభదైత్యమర్దనుఁడు గాని యితం డొకపేదగాఁడు మో
మోటముచేత నీవలదు మూ డడుగు ల్ధర యంచు జెప్పడున్
గాటపుటల్కదర్భఁ గొని న న్బొడిచెం గను లొట్టవోవఁగా
నాఁటికి నేఁటికిం దనయ నాకుడికన్నెటు లుండు జూడుమా? 17.

భగద—ఆచార్యా! మీరు చెప్పినదంతయు సహేతుకముగా నున్నయది. అట్లయిన నా కిప్పుడు కర్తవ్య మేమి?

శుక్రు—ఇదిగో నుపదేశించుచున్నాఁడ వినుము.

మ. అభిమానమ్మును జంపుకొమ్ము సమరవ్యాపారము న్మానుకొ
మ్మభయం బిమ్మని నందనందనుని పాదాంభోజము ల్వేఁడికొ
మ్మభిషేకంబును జేసికొ మ్మవనికిన్ న్యాయంబుగా నేలుకొ
మ్ము భువిం బిమ్మటఁ జూచుకొమ్ము సిరియొప్పు న్నీకు నె ట్లబ్బునో. 18.

శంబ—ఇదియే కర్తవ్యము.

క. అమరుల కాంగిరసుం డెటు
లమరారాతులకు శుక్రు డట్టులె కానన్
సమయోచితంబు లగునీ
విమలోక్తుల నవధరించి వినుము కుమారా. 19.

భగద—భగవానుఁడా! ఓభార్గవా! నీయుపదేశము మా కాదేశము గదా! నే నట్లే చేయుదు. కాని పితృమరణమునకుఁ బ్రతిక్రియఁ జేయుట యెప్పుడు.

శుక్రు—సమయ మగునప్పుడు.

తే. గీ. మానసంబున రవునుక్రోధానలంబు
గానఁబడకుండ దిగమ్రింగి కార్యవాది

సమయ మగునప్పు చెలరేఁగి జగము లడర
బైటఁ బడఁదగు నగ్నిపర్వతము వోలె. 20.

భగద—ఆచార్యా! మేలు మీమాట సిరసావహించితి. శంబరా! నీవు పోయి జనకుని యుత్తరక్రియలవిషయమునఁ బ్రయత్నము సేయుము. నే నిప్పుడె కృష్ణునిఁ జూచి వచ్చెదను.

శంబ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అప్పుడు శ్రీకృష్ణుఁడు సత్యభామయుఁ బ్రవేశించుచున్నారు.]

కృష్ణ—దేవీ! చిన్నవాఁడు నేను సాందీపునియొద్ద విద్యఁ గఱచునెడ నొక చిన్నపద్దముఁ జదివితి. దానియాదార్థ్య మిప్పు డెఱింగితిని.

సత్య—అది యేదో యెఱిఁగించి నాకు వీనులవిందు సేయుదురా?

కృష్ణ—సందేహ మేమి? ఇదిగో విను.

క. ఘనుఁ డైన నల్పుఁ డైనను
జననింద్యుం డైన లోకసమ్మతుఁ డైనన్
ధనియైనఁ బేద యైనను
దనతండ్రియె మంచివాఁడు తనయున కెపుడున్. 21.

సత్య—దానియాదార్థ్య మె ట్లెఱింగితిరి.

కృష్ణ—జగత్కంటకుఁ డగుతండ్రికొఱకు భగదత్తుఁడు మిక్కిలి విలపించుటచే దానిసత్య మెఱింగితి. ఇప్పుడు పితృశోకవిహ్వలుఁ డగుభగదత్తుని సమాశ్వాసింపవలయు.

సత్య—దేవా! తండ్రిని జంపి కొడుకు నె ట్లూరడింపఁ గలరు. మీకు మోమోటము లేదా?

కృష్ణ—సుందరీ! రాజనీతి మోమోటము నెఱుంగదు. తొల్లి రాఘవుఁడు వాలిం గడ తేర్చి యంగదుని యౌవరాజ్యమున కభిషిక్తునిఁ జేసి వానికి సేవ్యుండు గాలేదే. అది యటుండనిచ్చి యిటు వినుముఁ

మ. ఖలునిన్ మాగధుఁ ద్రుంచి తత్తనయునిం గద్దెం బ్రతిష్ఠించితిన్
దుఖువం గంసునిఁ జంపి నిల్పితిని బంధుల్ మెచ్చ మాతామహున్
బలుగాకి న్నరకు న్వధించితిని గానం బ్రోతు తత్పుత్రునిన్
దలియుంబోఁడిరో రాచపాడి యిది క్రొత్త ల్గావు మాకీపనుల్ 22.

అదిగో శుక్రచార్యసమేతుఁడై భగదత్తుఁ డచ్చట నున్నాఁడు.

సత్య—పేరు వినుటయే గాని భార్గవుల నెన్నఁడును దర్శింపలేదు.

కృష్ణు—దేవీ! ఇతఁ డసురగురుఁడైనను మహామహిమగలవాఁడు. వందనీయుఁడు.

(ఇద్దఱు నడచుచున్నారు.)

శుక్రు—కుమారా! దేవీసమేతుఁడై వాసుదేవుఁ డిటు వచ్చుచున్నవాఁడు. అభివాదము చేసి శరణ మడుగుము.

భగద—చిత్తము. రండు. వారి నెదుర్కొందము.

శుక్రు—జయతు జయతు దేవకీనందనః.

కృష్ణు—భార్గవుల కభివాదము సేయుచున్నవాఁడ.

శుక్రు—అనంతకళ్యాణమస్తు. యదుకుంజరా! నీకతమున పితృవిహీనుఁ డగు నీబాలకుఁడు నీకు రక్షనీయుఁడు. వత్సా! భగదత్తా! ఇదె నిన్ననుగ్రహించుటకు భగవంతుఁడు వచ్చియున్నవాఁడు. శరణమువేఁడుము.

కృష్ణు—అపరాధి వధింపఁబడియె. ఇతఁడు మా కవశ్యము రక్షణీయుఁడు.

భగద—(చేతులు జోడించి) దేవా! నందనందనా!

సీ. తమ్మిచూలిని గన్నతండ్రివయ్యు యశోదయొడిలోన బిడ్డఁడై యున్నవాఁడ
తెలిదీవిపై బాళిదెగడి వ్రేపల్లెలో మంద గాపరి వౌచు మన్నవాఁడ
వ్రేవెలందులయిండ్లు వేమారు కొల్లాడి వెన్నమీఁగడఁ జాల తిన్నవాఁడ
తలఁపుఁల నెక్కించి వలపుల గ్రుక్కించి గొల్లకన్నెలసిగ్గుఁ గొన్నవాఁడ
కమ్మవిలుకాని గడుపారఁ గన్నవాఁడ
వేఁడువారి నేలుదు వంచు విన్నవాఁడ
నన్నుఁ బ్రోవుము నీవాఁడ నన్నవాఁడ
చిన్నవాఁడనో నందుని చిన్నవాఁడ. (అని కాళ్ళపైఁ బడుచున్నాఁడు.)

కృష్ణు—కుమారా! లేలెమ్ము.! (అని లేవనెత్తి)

మ. అలుకం బూనకు మయ్య నాపయిని నీయాత్మన్ రవంతేనియున్
దలకుం దాల్పకు మయ్య నేఁ బగతుఁడం గానయ్య నీ కియ్యెడన్
ఖలుఁడై నీజనకుండు ముజ్జగములం గారించుటం జంపగా
వలసె న్వానిని సేయఁగావలసె దుష్ప్రారంభముల్ నీయెడన్. 24.

భగద— దేవా! ఇందు నీత ప్పేమున్నది? నీకుం బగతుఁడై మాతండ్రి స్వయముగా నింత తెచ్చుకొనియె.

కృష్ణు—ఓయీ! వెఱ్ఱివాఁడా! నాకుఁగాదు. లోకమునకుఁ బగతుఁడై యనుము.

శా. నాకుం జుట్ట మనంగ దాయయన నున్నాఁడే ప్రపంచంబునన్
లోకద్రోహులు మాకుద్రోహులు జుమీ లోకప్రియుల్ మాప్రియుల్

శ్రీకృష్ణుం డవతార మెత్తెను జగత్క్షేమంకరోత్సాహియై
మీకు స్త్రీకును గీడు సేయుటకు జన్మింపంగ లేదిద్ధరన్. 25.

శుక్ర—దేవా! నీకుం బుట్టినను బగతురు లేనిమాట నిజమే; కాని నరకుఁడు మీకుఁ బుట్టినను బగతుఁడుఁ గూడ నయ్యె.

సత్య—భార్గవులు లెస్సగా సెలవిచ్చినారు. ఈమహాత్మునకు నరకుఁడు భూమిదేవివలన గొడు కగుటచేఁ బుట్టను. ధర్మద్వేషి యగుటచే వైరి.

కృష్ణ—అదినిజమే. కుమారుఁ డయినను దుష్టుఁ డగుటచే వాత్సల్యమును ద్రోసి వాని వధించితిమి.

శుక్ర—ఎట్లయినను నరకుఁడు మీచే హతుఁడై ముక్తుఁ డయ్యె.

భగద—నాతండ్రి హరిచేత ముక్తుఁ డయ్యెనని నా కిప్పుడు కొంతదుఃఖ ముపశమిల్లినది.

కృష్ణ—వత్సా! భగదత్తా! నీవు లోకానుభవమున కపరిచితుఁడవు గాన నన్యథా భావింపవేని నే నింతుక యుపదేశింపఁ దలఁచుచున్నాఁడను.

శుక్ర—ఇది వాని ననుగ్రహించుట.

భగద—ఇందు నే నన్యథా తలఁపవలసినదే మున్నది?

కృష్ణ—నరుఁ డెంత తేజశ్శాలియైనను గుణవిహీనుఁ డైనచో నభ్యుదయము నొందఁడు. దానికి నీతండ్రియే తార్కాణము.

శా. ఆతేజంబున కాబలంబునకుఁ దోడై నీతియే యుండెనా
నీతం డంతటివాఁడు ముజ్జగముల న్నిక్కంబుగా లేడు నూ
నీతిభ్రష్టుఁడు గాన నిట్లు చెడియె న్నీతండ్రి నీవు న్సరా
రాతు ల్వోయిన పోకఁబోక గుణివై ప్రాగ్జ్యోతిషం బేలుమా. 26.

శుక్ర—కుమారా! ఈయుపదేశము నీ కనుసరణీయ మైనది.

భగద—ఇది నేను శిరసావహించుచున్నాఁడను.

కృష్ణ—ఇంకను నీ కుపదేశింపఁబగినవి రెండు గలవు. మహానుభావు లగుతపోధనులయెడల వినయవృత్తి నెరపుము. పరకాంతలయందు మాతృభావము నిలుపుము. వీనియందు ధర్మవిరుద్ధముగా వర్తించుట స్వనాశముం దెచ్చుకొనుటయె.

సీ. ఋషికి నెగ్గొనరించి వృషలుఁడై జనియించె నవనిలో సమవర్తియంతవాఁడు
మునులచేఁ బల్లకి మోయించి యజగరంబై పడె నహుషునియంతవాఁడు
జడదారి కొకకీడు సలిపియే శాపోపహతుఁ డయ్యె నమరేంద్రునంతవాఁడు
బ్రహ్మర్షి యల్కకుఁ బాత్రుఁడై నాఁడట్టు లడుగంటె వింధ్యునియంతవాఁడు

కాంతకై చెడె రావణుసంతవాఁడు
అతివకై చెడె మీతండ్రియంతవాఁడు
ఎవఁడు సుఖియించెఁ బరకాంత గవయఁగోరి
యెవఁడు వర్ధిల్లె బుషులకు నెగ్గు చేసి. 27.

మఱియు నిన్నొక ధర్మకార్యమునకు నియోగింపవలదు. అది యేదందువేని

తే గీ. తల్లిదండ్రుల కడబాపి తగవుమాలి
పదియు నాఱ్వేలకన్నెలఁ బట్టి తెచ్చి
చెఱల బంధించె మీతండ్రి చెనఁటి యగుచు
విడిచిపుచ్చుము వారి వేవేగ నిపుడు. 28.

శుక్ర—అవును. నరకునిపాలిఁటి మృత్యుదేవతలో యన్నట్టు లాకన్యకలు దుఃఖవిహ్వలమతులయి యున్నవారు. తత్క్షణము వారిని విడువుము.

భగద—ఇదిగో నిప్పుడే నేను పోయి వారిని విడిపించెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

సత్య—దేవా! అనాధ లగు నా రాజకన్యలను విపత్సముద్రమునుండి యుద్ధరించి మీరు పుణ్యముఁ గట్టుకొనిరి. మీ మేలు వా రెన్నఁడు మఱవరని తలంచెద.

కృష్ణ—సుందరీ! నే ననాధలకు నాధుఁడను. అగతికులకు గతినిగద.

సత్య—అందుచేత నే దేవతలు మహర్షులు మి మ్మాశ్రయించిరి.

శుక్ర—(ఆశ్చర్యముతో) ఎవరో యంతరిక్షమును దిగి యిటు వచ్చుచున్నారు.

కృష్ణ—(చూచి) మహేంద్రసఖుఁ డగు చిత్రరథుఁ డనుగంధర్వుఁడు.

సత్య—ఈవిజయమునుగూర్చి మిమ్ము బహూకరించుటకు మహేంద్రుఁ డతనినిఁ బంపియుండును.

శుక్ర—అదిగో బృహదశ్వమహాముని యిటు వచ్చుచున్నాఁడు.

సత్య—ఇతఁడు త న్నిమిత్తముననే యిటు వచ్చియుండును.

[అప్పుడు చిత్రరథుఁడు బృహదశ్వుఁడు ప్రవేశించుచున్నారు.]

చిత్ర & బృహ—విజయతాం విజయతాం దానవగజేంద్రపచానన.

కృష్ణ—గంధర్వరాజునకు స్వాగతము. మహర్షి కభివాదము.

శుక్ర—బృహదశ్వా! బదరికాశ్రమవాసులకుఁ గుశలమా? చిత్రరథా దివ్యుల కభ్యుదయమా!

చిత్ర & బృహ—ఇప్పు డభ్యుదయమే.

కృష్ణ—మీరాఁక చేత ధన్యుఁడ నయితిని.

చిత్ర—దేవా! మహేంద్రుఁడు మీ రొనర్చినయుపకారమునకుఁ గృతజ్ఞుఁడయి తనభక్తిని మీకు విన్నవింపు మని నన్నుం బనిచె. ఇదిగో నాతనిమాటలు వినుఁడు.

క. అనుజుఁడవై యొకమా రా
దనుజభయం బుడిపి యొక్కదరిఁ జేర్చితినన్
మనుజుఁడవై యిప్పుడు దితి
తనుజుల మర్దించి నన్ను దయఁ జూచితివా. 29

కృష్ణ—ఎంతమాట మహేంద్రునకు నేనా యుపకారము చేయఁగలవాఁడను. ఈజయమునకుఁ గారణము మహేంద్రప్రభావమే.

తే. గీ. అన్న సన్నద్ధుఁడై పోరకున్న నేమి
తమ్ముఁడట్టియె గెల్చెగా దనుజతతిని
మాపుల నినుండు లేఁ డనుమాటె గాని
చంద్రకాంతియు నతని తేజంబ కాదె? 30.

చిత్ర—ఇది కేవల వినయోక్తి.

బృహ—దేవా! బదరికాశ్రమతాపసులు తమభక్తి విన్నవింపు మని నన్ను మీ వద్దకుఁ బుత్తెంచిరి.

మ. శ్రవణానందముగా వినంబడియె శూరమ్మన్యగర్వాంధుదై
త్యవిభుం డ్నీవిట జంపినట్టిశుభవార్త ల్తాపసశ్రేణిచే
భువనంబు ల్పదునాలుగుం బడసె సంపూర్ణప్రమోదంబు నీ
భువి నీరాక్షస మయ్యె నీకరుణ నుత్ఫుల్లాంబుజాతేక్షణా! 31.

కృష్ణ—దివ్యులయు మహర్షులయు ననుగ్రహముచే నేనిప్పుడు విజయలక్ష్మీసమేతుఁడనయితిని.

బృహ—ఇప్పుడు గాదు. ఈవిజయలక్ష్మిని నీవు ద్వారక నుండియే వెంటఁదెచ్చితివి.

చిత్ర—అవునవును.

క. ఇత్తలిరుబోఁడిచేఁ గ్రో
న్నెత్తురులను ద్రావునట్టి నీచదనుజులన్
మొత్తించుట మెత్తనిపువు
గుత్తులతో రాళ్లు పగులఁగొట్టించుటజూ. 32.

బృహ—దివ్యమనుష్యాంగనలలో నెవ్వరు నీమెకు సవతురారు.

శక్ర—లావణ్య ముండుచోట పరాక్రమ ముండుట యరిది.

[అప్పుడు భగదత్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భగ—దేవా! మాతండ్రిచేత బంధింపఁబడినరాజకన్యల విడిపించితిని. వా రందఱు రమానాథుఁడు జగన్నాథుఁడే మాకు నాథుఁ డని మిమ్ముం బరిణయ మగుటకుఁ గోరుచున్నారు.

చిత్ర—ఇది మీకు నిరాకరింపఁదగినది గాదు.

బృహ—జగత్కల్యాణకరునకుఁ గళ్యాణము లగుట వింత గాదు.

శుక్ర—ఆకన్య లనుగ్రహింపఁబడుదురు గాక!

కృష్ణ—ఇందు నేను మధ్యస్థుఁడను. సత్యభామయే దానిని నిర్ణయింపవలయు.

సత్య—భరియించువారు మీ రుండఁగ నేను నిర్ణయింపవలసినదేమి?

కృష్ణ—సవతులతో వేగవలసినదానవు నీవు.

సత్య—ఇంతటు భాగ్యులతో మీరు వేగఁగా సవతులతో నేవేగఁజాలనా ?

కృష్ణ—భగదత్తుఁడా! మహర్షిసమక్షమున నందఱ నేను బరిగ్రహించితి.

చిత్ర—దేవా! పోవుటకు మా కింక ననుజ్ఞ యిమ్ము.

మ. అవతారంబుల నెత్తి భూభరముద్రోయ న్మీనమై కూర్మమై
సువరాహంబయి నారసింహ మయి గుజ్జుం బ్రోడయై మీఁద భా
ర్గవుఁడై రాఘవుఁడై యదుప్రవరుఁడై కళ్యాణము ల్గూర్చి యా
దివిజానీకము గాచు వైష్ణవమహాతేజంబు మమ్మేలుఁతన్. 33.

బృహ—దేవా! నిన్ను నేను గొనియాడఁజాలను; కాని

సీ. ప్రామిన్కుటువిదల సీమంతమణు లౌచు నలరారు నెవ్వానియడుగుదోయి
బ్రహ్మాండగృహమందు రతనంపుదివ్వెలై కడువెల్గు నెవ్వానికన్నుదోయి
శ్రితజనంబుల కల్లఁ జేయూతకోలలై క్రాలెడు నెవ్వానికేలుదోయి
దుష్టనాశము దెల్పు ధూమకేతువు లౌచు మెడివడు నెవ్వానిబొమ్మదోయి
యట్టిజగదేక గురునకు నచ్యుతునకు
నాదిమధ్యాంతరహితున కవ్యయునకు
విశ్వమోహనునకు మహాపురుషునకును
జ్ఞానమయునకు నంజలి సేనొనర్తు. 34.

కృష్ణ—దేవతలయు మహర్షులయు నీప్సితములు సిద్ధించుగాక.

బృహ—జగముల కిదివఱకే యనంతకళ్యాణము లైనవి. వెండియు నిట్లగుఁగాక!

చ. నెలకును మూడువాన లవనిం గురియందగు బంట లెచ్చ రా
జులు ప్రజలం బలెం బ్రజలఁ జూచుకొనం దగుఁ బ్రేమమీఱ నీ
పతిఁ దలిదండ్రు లింక దలవాపులఁ దెచ్చెదు చెడ్డబిడ్డలన్
బెలుచన శిక్ష చేయఁదగుఁ బ్రేమముఁ బ్రోసి ప్రసన్నయాదవా! 35.

కృష్ణు—తథాస్తు. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

సమాప్తము.